ట్టు, చిత్త చలనగుణముచేత విశాలమైన, జగద్భ్రమఉదయించే,నిశ్చలచిత్తముచేతచూస్తె, నిజమైనకేవలాత్మయెప్పుడునుండునూ.

105. సర్వంకేవలాత్మేకాని, మరివకవస్తువలేదుగదా. యీభ్రాంతితోచడమునకు ఇతరంయేమివున్నది,యీభ్రాంత్తియేలాగుకల్గె। యెవ్వరికితోచెనంటివా। తోచెననిచెప్పినందునశంకతోచింది। నామరూపగుణవర్ణములులేని, కేవలమందుపుట్టింది-అని చెప్పవశముగాదు.

106. అదిగనుకపుట్టుటలేదు । ప్రతిబింబించుటలేదు। అనాది।అనంత్తమై, కదలకనిండి, యేవికృతులూలేక, ఏకవిధముగానే, కేవలాత్మ యుండును.

107. ఆమహాపరతత్వం, ఆకాశమువలెనే ఆకాశాతీతమై,.యెందునానంటక, అతిశూన్యమై । అంతర్బాహ్యావ్యాపకమున, ఇంతైనావెలితిలేక, సకలానికి ఆధారాధేయమై। ప్రకాశించుచుండే।ఆకేవలపరబ్రహ్మసత్తామాత్రమునయీబ్రహ్మాండజాలములన్నిపరమాణరూపములవుచూ, ఉత్పత్తిస్థితిలయములపొందును। కేవలాత్మజ్ఞప్తివిస్మృతులబారయక, సర్వాధిష్ఠానమగుటవలన। అచ్చటజన్మనాశంబులుమొదలయ్న్న సమస్తమూఅవ్యేదిసహజస్వభావములగును, అదెట్లంటేని, మొదలుఆకాశం, యేతీరుగాబుట్టెనో। అం

దుర్వాసింన్ని। వాయువున్నూ, యేతీరుగాపుట్టెనో। ఆలా గేనిర్వికారనిజతత్వమందు, వికారభూతమై । ఘనమయిన విశ్వరూపముతోచెను.

108. సుషుప్తికి తెలివియే విధముచేతఘర్మమవుచూవుం డునో । ఆత్మతత్వమందు ఆలాగే। విశ్వముకారణములేని కార్యమై-కనుబడుచూ । ఆత్మయందేతోచి, ఆత్మయందే లయమౌను, నీవుయీభ్రాంతిని, నిజమని భావించుటవల న, విశ్వమనితోచబడెను, యెక్కడచూచిన అక్కడనల్లా ఆత్మేనిండియున్నది.

109. ఏకమై । అగుణమై । ఆకారరహితమై । అద్వ యమై । అవ్యక్తమై । వున్నఆత్మప్రకాశమందు । కొందరు కొందరు । హరి - హర-బ్రహ్మ, హుతవహ, మార్తాండ, చంద్రాదిమూర్తుల, నారోపించి, సగుణోపాసనపరులై, వుందురు, మరికొందరుకొందరు, ప్రణవమనిన్ని, యెరు కరూపమనిన్ని, అదిశూన్యమనిన్ని, అనేకరీతులుగాభావిం తురు, యెవరుయేతీరుగాభావించిన, ఆతీరుగాకనుపడును.

110. ధరణిమీదబుట్టేసర్వభూతములవలెనే, సముద్ర మందుబుట్టే - తరంగబుద్బుదములవలెనే, అఖిలకారణమైన పరమాత్మయందు,విశ్వంవుదయించును, వృద్ధిచెందును, విల యమౌను.

111. సర్వమునకు అతీతమై, సర్వమందునిండి, సర్వమయుడై, సర్వాంతరస్థితమై, సర్వముదానే, అవుచుంచు కేవలాత్మ ప్రకాశించును.

112. జగముమీదిభ్రాంతి చేతచూచిన, జగమేతోచును, ఆత్మభావనచేతజూచిన, ఆత్మేతోచును, గనుకయీరెంటికిమూలముమనస్సు, విశ్వమనేభ్రాంతేబంధం, భ్రాంతివిడుపడమేముక్తి.

113. కేవలపవిత్రమైనపరమాత్మయందు-ఆకార విహీనమైన - నిర్గుణపరమాత్మనుజూచిన - ఆలాగేతోచును,కారణకార్యరూపమైనజగత్తనిచూచిన - ఆలాగెతోచును-అదెట్లంటే - దారుమయమైన - గజములవలెనే యొకటొటి రెండువిధాలకనుపడును.

114. స్ఫటికవిరచితమైన కుంచములో - వెలుగుచున్న దీపమువలే - బయిట - లోపల - వ్యాపించి - కేవలాత్మకనుపడుచున్నది.

115. స్ఫటికము - స్ఫటికకాంతియును - యేకమైనట్లు - సూర్యుడు - యెండవొకటైనట్లు - వనగళ్లు - వుదకం - వొకటేఅయినట్లు - విశ్వమునకుపరమాత్మకు, ఆలాగే వేరులేదు.

116. కారణంబ్రహ్మ - కార్యంవిశ్వం - కార్యకారణ ములకు కర్తయై - కలసి - మెలసి - మఱికార్యకారణాతీతు డై - తానేయుండును.

117. దేహములోవసించి-జీవునికిమూలమవుచు - సూర్యునివలెనె - దేహికి దేహానికి - విదేహియై - అతీతుడై- కేవలాత్మ ప్రకాశించును.

118. నిజమైనవాక్యమొకటిచెప్పెదవినుండు- జగములుఆభాసేకాని - నిశ్చయముకావు-నీమనస్సుకు నిశ్చయమంచు తోచెనా ! కేవలాత్మ జగత్తనీ తెలుసుకో - వేరేఅనుకోకు.

119. ఎక్కడజూచిన కేవలాత్మేనిండియున్నది - దానివలనజగత్తువేరేపుట్టివున్నదంటివా - దానికి వేరుకాదు - అదెట్లంటేని - సింహ్వాంకడుపున సింహ్వమేపుట్టిందనవలెగాని-యెద్దుపుట్టిందిఅనరాదు.

120. అట్టిపరమాత్మవునీవే - యెక్కడచూచిన-అక్కడనల్లానీవేవిశ్వమంత్రయునీవే.

121. నిఖిలమునీప్రతిబింబమేకాని - మరివకటికాదు-అదెట్లంటే - దర్పణములోని - నీడ, తనకువేరుకాదు.

122. అనరాక - కనరాక - వినరాక - బుద్ధిచేతన యినగైకొనరాక - అగమ్యమై - వుండేఘనమఘన - పరమాత్మవు - నిశ్చయముగానీవేసుమా.

123. గురుడు దెల్పిన బోధకారణమేదో - బ్రహ్మాదిసురలకైనా - అప్రాప్యమేదో । సర్వవేదాంతార్థసారంమేదో । విశ్వోద్భవస్థితి విలయములకుస్థానంమెదో - యెప్పుడునాకు-తీరుగా వుండేదిమేదో-యెరుకలకు యెరుకరూపమైయెరిగేది యేదో - చిన్మాత్రకమీద జెలగేదియేదో-ఆదిమధ్యాంత రహితమైనదియేదో - మూడిటిమీద నెలకొన్న ముఖ్యంయేదో - అదెపరమప్రకాశమైన ఆత్మరూపం - అదే నీనిజరూపము.

124. పరమైనలాభం లేనిదియేదో - పరమైనసౌఖ్యం తోచినదియేదో,పరమైనలాభాన్ని తెలియనిదియెదో,అదేపరమాత్మ, అట్టిపరమాత్మవే-నీవు.

125. సచ్చిదానంద, విజ్ఞానతత్వబుద్ధినిమీరి, యోగములపైనజేరి, పరమకారణమై ప్రకాశించెదే పరబ్రహ్మరూపం, అదే-నీవు.

126. సర్వసత్తావిశిష్టమై, సర్వనిర్మలమహాచూ,నిశ్చలంగావుండేది, సంవిదానందభోధైక, సత్ప్రకాశం, అదెనీరూపం, యెన్నిమాట్లు జెప్పినయిదేజాడ, రెండవదిలేక, యేకమైవుండేదేఆత్మ, ఆయాత్మవు-నీవే, నేనునీవే, భేవమనేదిలేక సుఖముగానుండుమూ.

## సగుణనిర్గుణధ్యాన ప్రకరణం.

127. శ్రీగురుధ్యానంమేలాగుజేయవలెనంటే, ధ్యానం అయిదువిధములై యుండును । అదెట్లంటేని మూఢభక్తిచేత, లోహాదిప్రతిమలయందు మనుస్సుంచి, ధ్యానముచేయడముపేరు - అధమాధమము, శివకేశవాదులను పాదాంగుష్టంమొదలుచేశిరస్సుదాకా - మనస్సునేతధ్యానముచేయడము పేరుఅధమధ్యానం.

128. మనుష్యరూపంధరించిన గురువును, పాదాదిశిరస్సుపర్యంతంస్థిరమనస్సుచేత, ధ్యానించడముపేరు - మధ్యమధ్యానం.

129. పూంతమౌన సుడవుకొనుచూ । రేచకపూరకములచేత, వాయువుల జయించి సమదృష్టినిలిపి లక్ష్యంచేత ప్రణవ మయమయిన, చితకళానే పరమరూపాన్ని ధ్యానించుట పేరు - ఉత్తమధ్యానమనబడును.

130. దేహానికి । యింద్రియాలకు । మానసధర్మ కోటికి । నేను విలక్షణుడనిన్ని । వీటినన్నింటిని గుర్తెరిగే ద్రష్టను । నిజబోధరూపుడను । శాశ్వితవస్తువను । అసిజ్ఞప్తిచేత చూచేదే, ఉత్తమోత్తమధ్యానం-యీచెప్పిన అయిదుధ్యానములు, గుణధ్యానములు.

131. నిర్గుణధ్యానం యేలాగంటే, అది రెండు విధము లై యుండునూ, అదెట్లంటేని, తుర్యంఅనేది, తుర్యాతీతం అనేది విధములు- ౨॥

132. అందు, తుర్యధ్యానం యేలాగంటే। తను, మనో, ధర్మములవిడిచి।తత్వసారవిజ్ఞాన రూపాన్ని తెలశి, కేవలానంద, సంపూర్ణభావమును జెందడమే, తుర్యధ్యానమనబడును.

133. పరమాత్మ, విశ్వము,కలిశీ కలియకనుండును।అదెట్లంటే, పరిపూర్ణ ఘటములో వుండే గగనంవలెనే, అని తెలిశి। విశ్వములో వెల్గుచుండి, లేకుండుటే - తుర్యధ్యానమనబడును। అదే - బ్రహ్మానందమనబడును.

134. తను, మనః, ప్రాణ, ధర్మసముదాయమునకు। పరస్పరమైన, ఆత్మతత్వమును దెలిశి।అట్టిపరమపద, నిర్గుణస్థానమును బొందడమే తుర్యాతీత ధ్యానమనబడును

135. సందులేక సర్వమందును, తానేఅయ్యుండి।యెందునా అంటక వుండిన్ని అంటివుండి। ఆకాశమువలెనే,కానరాకవుండేది యేదో। దాన్ని జెందడమే తుర్యాతీత-మనబడును.

136. అజాడ్యం దేహవిషయం। సంవిదాకృతి చేత వెలుగు దావి మననం జేయము। మనోధర్మం। వీటిని దాటడమే-తుర్యాతీతం.

137, మూటి, మూటి, మూటి । నాల్గింటిని దాటి, మేటిగోటునజేరి । అకడ లీనంగావడమే తుర్యాతీతం.

138. సుస్థిర భావమును జెంది।తరంగములులేనిసముద్ర మువలెనే।నిండివుండును । పర్వతము వలెనే-కదలక వుండు ను, తెలివిగల్గికదలని దీపమువలెనే, నిలిచి యుండును, అదే తుర్యాతీతం.

139. తనుత్రయం అవస్థాత్రయం జీవత్రయం యె కడబుట్టి యెకడలయమొందునో । వీటిపుట్టుకప్పుడూ, వీటినాశనమప్పుడూ, సాక్షిగా యెప్పటికి యేకరీతిగా, యే దివుండునో, దానిని జెందడమే - తుర్యాతీతం.

140. వెల్గులోపలి వెల్గును । వెలిగించిచూచిన, వెల్గుల న్నియుమల్గిననుకొనకు వెల్గేదియేదో దాన్ని । మెలగడమే, తుర్యాతీతం.

141. పరమముఖ్యమైన । పరమాత్మ తేజము। నేనేనని మనస్సుయందు నిశ్చయించుకొని।అందులీనముగావుండడమే, తుర్యాతీతం.

142. ఇదే తుర్యాతీతం । యిదే మోక్షఫలబ్ధి । యి దే చిత్తలయం । యిదే పరమాత్మైక్యం । యిదే కేవల స మాధి.

143. ఇదే నిజము । యిదే నిర్వికల్పం, యిదేనిశ్చి తార్థం । యిదే విబుధవేద్యం । యిదేతత్వం।యిదేస్వాను

భూతి । యిదే నిర్గుణధ్యానం। యిదే సకలానికీ మూలం। యిదే తరుణోపాయం-యీ పరమార్థం మనోహరమై, భవహరమై, సురుచిరమై । సుఖకరము అవుచూ భాసిల్లును.

ముక్తి ప్రకరణం.

144. ముక్తి అనఁగా యెటువంటిదంటే।లింగశరీరము మొదలైన నాల్గుశరీరాలు । వాసనాక్షయములై, భంగము లాయనా ముక్తిగల్గును । అదెట్లంటే । స్థూల సూక్ష్మ కారణ మహాకారణ । తుర్యములనేవి, యీ అయిదు శరీరాలు కలవూ । అందులో స్థూలశరీరం మాయకు మూలమైనస్థలం । లింగశరీరం మనస్సుకునిలుపట్టు । కారణదేహం జీవునికి నిజస్థానం । మహాకారణ శరీరం యీశ్వరునికి యిల్లు । తుర్యం । ఆనందానికిస్థానం । అన్నింటికీపైన ప్రకాశించేది. పరమాత్మ స్వరూపం । ఇది మొదలుకొని స్థూల దేహపర్యంతం వొకటిని వొకటి అనుసరించి వకదాని సత్తాచేత వకటి వెలుగుచుండును.

145. ఇన్ని శరీరములలో పల స్థూలసూక్ష్మ శరీరాలు రెండునుకార్యాకారణ, మవుకొంచూ-వుండునూ, సమస్త కార్యములనుసూక్ష్మ దేహంచేయించేది, స్థూలదేహంచేస్తువుండేది,యిందువలనకర్మండుదయించి, ఆకర్మంమూడువిధములైయ్యుండును,అదెట్లంటేని,జన్మజన్మాలకుసరిపోక శేషిం

150. శరీరముకంటే మునుపు, శరీరంవున్నప్పుడు, శరీరము, పోయినవెనుకా, యెప్పుడూవకరీతిరుగానే పరిపూర్ణమునిండియుండును. మాయనడుమ వచ్చును, నడుమనే పోవును, మోక్షమనంగా వేరే మూడులోకాలయందు లేదు, వెదకిచూచే టందుకు దానికి ఆకారంలేదు, తనను తానుగుర్తెరిగి, తనసంగ్గం విడువడమే, మోక్షమవునూ, యిదేవిదేహముక్తి, యిదేపరమాత్మైక్యం, యిదేభవవిరహితం, యిదేచిత్తవిలయం, యిదేసంసారవాసనాక్షయము. ఇతిసర్వార్థములను సారసంగ్రహముగా వ్రాయబడినది.

శ్రీమత్పరశురామ నృసింహ్వదాసకృత చూర్ణిక.

శ్రీమద్రామమడుగు శ్రీశివరామ దీక్షిత నిజగురుస్తవం.

151. శ్రీమద్గురు కరుణాకటాక్ష వీక్షణ విచక్షణ సంపూర్ణ, ఋగ్యజస్సామాధర్వణతర్క-వ్యాకరణ మీమాంసభాట్టప్రభాకర, వేదవేదాంత్తశాస్త్రాగమఅష్టాదశపురాణేతిహాసపరిశీలనం। శిష్యజనపరిపాలనం॥ నిత్యానిత్యవస్తువివేక-ఇహాముత్రార్థ ఫలభోగవిరాగ - శమదమశాంతి తితీక్షా-శ్రద్ధోపరతి-ముముక్షుత్వస్వస్తికారోపణస్పర్శత్రివిధ దీక్షాపరం। భక్తవశీకరం॥ యమనియమాసనప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణ సమాధ్యష్టాంగ యోగ, మంత్రలయహటరాజయోగ నిష్ఠాగరిష్ఠాత్మధ్యాన రాధా

యంత్రషణ్ముఖీ, శాంభవి ఖేచరిముద్రాభ్యాస, ఆధారస్వా
ధిష్ఠాన మణిపూరకానాహత విశుద్ధాజ్ఞేయ సహస్రార
చక్రపరిశోధకం । ఆత్మబోధకం ॥ ఆకాశవాయురగ్ని జల
పృథ్వీశబ్ద స్పర్శరూప రసగంధశ్రోత్ర త్వక్చక్షు జిహ్వ
ఘ్రాణ, వాక్పాణిపాదపాయూపస్థ, వచనదానగమన విస
ర్గానంద,మనోబుద్ధిచిత్తాహంకార, ప్రాణాపానవ్యానో
దాన సమానాన్నమయప్రాణమయ, మనోమయ విజ్ఞాన
మయానందమయ,పంచకోశవిశేషవిమర్శ సచ్చిదానందం॥
వందితమునిబృందం॥ స్థూలసూక్ష్మకారణమహాకారణ, విశ్వ
తైజస, ప్రాజ్ఞప్రత్యగాత్మ, సత్వరజస్తమశ్శుద్ధ, సాత్విక,
జాగ్రత్స్వప్నసుషుప్తి, తుర్యావస్థా కారోకార మకార
ఓంకార మాతృకాచతుష్టయ విచారణీయ్యం । తనుచతుష్ట
యాతిశయం॥ ఈశ్వరతనుచతుష్టయ విరాట్హిరణ్యగర్భ
అవ్యాకృత ఈశ్వర, సద్యోజాతవామదేవఅఘోర తత్పురు
ష ఈశాన పంచబ్రహ్మశరీర, నివృత్తి ప్రతిష్ఠావిద్యాశాంతి
శాంత్యతీత పంచవిషయ క్రియాశక్తి, జ్ఞానశక్తి, ఇచ్ఛా
శక్తి, ఆదిశక్తి, పరాశక్తి, పంచకళా బ్రహ్మవిష్ణురుద్ర
ఈశ్వర సదాశివ పంచకర్తోత్పత్తి॥ స్థితిప్రళయ సర్వసా
క్షి॥ సూర్యచంద్రాగ్నిబ్రహ్మానందాతిశయస్థాన, సర్వకర్తృ
త్వ సర్వపాలకత్వ సర్వ సంహారకత్వ సర్వ నియంతృత్వ
సర్వభోక్తృత్వ సర్వేశ్వరత్వాది షడ్గుణైశ్వర్య భోగానుభ

వం। మహానుభావం । ఇడాపింగళా సుషుమ్నాంతర్గత బంధత్రయ రేచకపూరక కుంభక మూలాంధర, జాలాంధర, వొడ్యాణ బంధవిమోచన, శ్రవణమనన నిదిధ్యాసన, వర్ణాశ్రమ కులగోత్ర నామరూప షడ్భ్రమ, క్షుత్పిపాస, జరామరణ, సుఖదుఃఖ, షడూర్మి రహిత ముక్తికాంతాసహిత తత్వమస్యాది మహావాక్యార్థ లక్ష్యార్థ బ్రహ్మైక్యానుసంధాన, నాదుబిందుకళాతీత, అద్వయ। అవాచ్య అచింత్య అవ్యయ నిత్యశుద్ధ బుద్ధ ప్రజ్ఞాన ఘననిర్వికల్ప నిర్వచన నిర్వికార నిరాకార నిశ్శబ్ద నిరతిశయ నిరుపమాన నిర్మల నిర్గుణ నిరవయవ, నిరంధ్రనిర్విశేష నిరుపద్రవ, నిషిద్ధ నిష్కర్మ నిష్కళంక నిష్ప్రపంచ నిరంజన నిరాభాస, సర్వవికార శూన్యసహజామనస్క। రాజయోగసమాధ్యా ధ్యక్షం। శ్రీశివరామదీక్షం॥ తచ్చరణ సరసీరుహయుగళ సంజనిత మకరంద బిందుసందోహాస్వాదమత్త భృంగాయమాన, పరశురామాన్వయాంబోధి, శరచ్చంద్రికాపూర్ణ సుధాకర, శ్రీమత్కౌండిన్యమౌని గోత్రోద్భవ కోటేశ్వర నామధేయ, తత్పత్నీసుబ్బమాంబా గర్భసంజాత, వేంకటనారసింహ, దాసోహం సంతతంభజామి.

సప్తశ్లోకభాగవతము.

152. శ్రీభగవాన్వాచ॥ శ్లో॥ జ్ఞానంపరమగుహ్యమ్మే। యద్విజ్ఞానసమన్వితం। సరహస్యంతదసంగంచ। గృహాణగది

తంమయా॥ ౧॥ యావాహానంయథాభావః। యద్రూపగుణ కర్మకః। యథైత త్తత్వ విజ్ఞాన। మస్తుతేమదనుగ్రహాత్॥ ౨॥ అహమేవాసమేవాగ్రే। నాన్యద్యత్సదసత్పరం। పశ్చాదహంయదేతచ్చ॥ యోవశిష్యేతసోస్మ్యహం॥ ౩॥ ఋతేర్థంయత్ప్రతీయేత। నప్రతియ్యేతచాత్మనీ। తద్విద్యాత్మనోమాయాం। యథాభాసోయథాతమః॥ ౪॥ యథామహాంతిభూతాని - భూతేషుచ్చావచేష్వను। ప్రవిష్టాన్యప్రవిష్టాని-తథాతేషునతేష్వహం॥౫॥ ఏతావదేవజిజ్ఞాస్యం।తత్వజిజ్ఞాసునాత్మనః। అన్వయవ్యతిరేఖాభ్యాంయత్స్యాత్సర్వత్రసర్వదా॥౬॥ శ్లో॥ ఏతన్మతంసమాతిష్ఠ। పరమేణసమాధినా। భవానకల్పవికల్పేషు।నవిముహ్యాతికర్హిచిత్॥౭॥ ఇతి భాగవతం సంపూర్ణం॥

శ్రీసీతారామనిజగురు స్తవపంచరత్న - శ్లోకములు.

శ్రీమద్భాగవత, శ్రీకృష్ణదేశిక ప్రభు మహారాజు కృతం.

153. శ్లో॥ నమస్తేనమస్తేమహీజాహృదీశా। నమస్తే నమస్తేమహాఘౌఘనాశా। నమస్తేనమస్తేదినేశప్రకాశా।నమస్తేనమస్తేస్తుభద్రాచలేశా॥ ౧॥

శ్లో॥ నమస్తేనమస్తేసదానందరూపా। నమస్తేనమస్తేషడాస్యప్రతాపా। నమస్తేనమస్తేచిదాకాశదీపా। నమస్తే నమస్తేస్తుభద్రాద్రిభూపా॥ ౨॥

శ్లో॥ నమస్తేనమస్తేరమానేత్రకామా । నమస్తేనమస్తే రణస్థానభీమా । నమస్తేనమస్తేమునిస్తుత్యనామా । నమస్తే నమస్తేస్తుభద్రాద్రిధామా॥ ౩॥

శ్లో॥ నమస్తేనమస్తేశ్రితఃశ్రీఉరోజా । నమస్తేనమస్తేజగత్సృష్టిబీజా। నమస్తేనమస్తేస్తునాభీసరోజా। నమస్తేనమస్తేస్తుభద్రాద్రిరాజా॥ ४॥

శ్లో॥ నమస్తేనమస్తేస్తుగాంగేయవాసా। నమస్తేనమస్తేంఘ్రిగంగానివాసా । నమస్తేనమస్తేసుధాంబోధివాసా। నమస్తేనమస్తేస్తుభద్రాద్రివాసా॥ ౫॥

ఇతి శ్రీమద్భాగవత శ్రీకృష్ణ దేశికప్రభు విరచిత పంచ రత్నములు సమాప్తము.

శ్రీ శ్రీధరస్వామికృతం.

నిర్వాణద్వాదశశ్లోకః - అచలవిషయం

154. శ్లో॥ ఆత్మానమఖిలాధారం।త్యక్త్వావా సనయాసహ । సదాసుషుప్త్యవస్థస్థే । జ్ఞానకర్మవివర్జితాత్॥

శ్లో॥ కర్తృత్వంకారయితృత్వం।సదానాస్తికదాచిత్। సదాసుషుప్త్యవస్థస్థే । భ్రమమూల వివర్జితాత్॥ ౨॥

శ్లో॥ సదాశరీరరహితం।జన్మకర్మనివారణాత్ । సదాసుషుప్త్యవస్థస్థే । జ్ఞానకర్మవివర్జితాత్॥ ౩॥

శ్లో॥ ఏకస్యమూలం శూన్యంహి। ఏకంనాస్తికదాచన। సదాసుషుప్త్యవస్థస్తే । విశిష్టాద్వైతవర్జితాత్॥ ४॥

శ్లో॥ సర్వమస్తీతికోవేద, నాస్తీతీకేన నిర్ణయః। సదాసుషుప్త్యవస్థస్తే। అస్థినాస్థీతివర్జితాత్॥ ५॥

శ్లో॥ చిత్రావిచిత్ర సామార్థ్యం । జ్ఞానేనసహానశ్యతి॥ సదా సుషుప్త్యవస్థస్తే। జ్ఞానాజ్ఞానవివర్జితాత్॥ ६॥

శ్లో॥ సదావికారరహితం, భావాభావవివర్జితాత్। సదాసుషుప్త్యవస్థస్తే । సర్వద్వంద్వనివారణాత్॥ ७॥

శ్లో॥ సదాసదసద్రహితం, సుఖదుఃఖవివర్జితాత్।సదాసుషుప్త్యవస్థస్తే, చిజ్జడద్వంద్వవర్జితాత్॥ ८॥

శ్లో॥ ఉత్పత్త్యాదిత్రయం శూన్యం, కార్యకారణవర్జితాత్, సదాసుషుప్త్యవస్థస్తే।విభాగరహితంసదా। ९॥

శ్లో॥ విభాగాన్యం మూలశూన్యం।సర్వద్వైకప్రకారతః। సదాసుషుప్త్యవస్థస్తే। నతుజన్మకదాచన॥ १०॥

శ్లో॥ నాను భావోనచంజ్ఞానం, ధ్యానకర్మనచక్వచిత్। సదాసుషుప్త్యవస్థస్తే । సాధనద్వయవర్జితాత్॥ ११॥

శ్లో॥ సదా ఆద్యంత్తరహితం, అంతర్బాహ్యావివర్జితాత్।సదాసుషుప్త్యవస్థస్తే,శ్శంకానాస్తికదాచనా॥१२॥

ఇతి, శ్రీ శ్రీధరస్వామి విరచిత నిర్వాణ,

ద్వాదశ శ్లోక సంపూర్ణం.

## శ్రీశంకరప్రభు మహారాజులవారు చెప్పిన లోకోక్తి ముచ్చట వేదాంతము.

### బీజభజనం

155. లక్ష్యత్రయమనే పొయిమీద, మండలత్రయమనే మంగలంబెట్టి-సుజ్ఞానాగ్నిని దరికొలిపి-మహావాక్య,వాక్యార్థములను ధరియించి, కర్మతుషాఛన్నమైన, బీజాంన్ని విద్వద్గరిష్ఠుడగు నిజగురుప్రభుడు వేచితే, పునర్జన్మాంకురంలేక అనుభవయోగ్యమైయుండును।యీవిత్తనంమళ్లీ మొలవదు.

### త్రిపురసంహారం

156. బిందువనేకోదండమునకు.నాదమనేగుణమెక్కిం చి-కళయనే సాయకముతొడిగి-సాధనచతుష్టయమనే గుఱ్ఱములగట్టినవిజ్ఞానరథంమీదమెక్కి-వివేకసారథినిర్మలవిచారరజ్జువుగానినడుప, దృఢనిశయాట్టోపదీపితజీవాఖ్యశివుడు తనుత్రయమనెపురత్రయాంన్ని,దగ్ధముచేశిశంకరుడయ్యెను.

### అమృతపానం.

157. నిజగురుడనే నారాయణుడు మహావాక్యమనే కుంభమందు సమరసానందామృతంనింపి వడ్డించితే ముముక్షుశిష్యదేవతానీకం స్థిరమాన సాంజలిపుటముల త్రావి, సంపూర్తినొంది తనవులుమరచి పావనమూర్తులై, మరుపనే- నిమిషములులేక, అనిమిషా, మరామర్త్యా, నిజరామృతదేహులని, ప్రసిద్ధిజెందిరి.

## గజేంద్రమోక్షం.

158. సంసార మనే సాగరమందు, దేహి యనేగజ రాజు, మోహమనే-నక్రముచేతజిక్కి, దీనతజెంది స్రుక్కి, మొఱ పెట్టిన, దయచేతం జూచినవ్వి, గురువనే నారాయణుడు, మహావాక్యమనేచక్రముచేత, మోహమనే, నక్రమును ద్రుంచి,దుర్ధ్యాన, మహావస్థబాపిన సుఖిర్మై, సుఖంబుబొంది, సర్వలానందరూపుడాయెను.

## సీతాదేవి,

159.. నీలమేఘం కొప్పుగా, మెరుపుతీగెలు, మేని మెరుపుగా, పీతాంబరమనే, పీతాంబరంగట్టి రత్నరుచికంచుకందొడిగి, కాంతి తారాహారములుదాల్చి, కుందనపు మెరుగు, కుంకుమగా ధరించి,మాతాఽ౦ డేందు తాటంకములుధరించి, -ప్రణవనాదంనూపుర ధ్వనిగామ్రోయ, లక్ష్యత్రయాంతః పురమందుండే, నిర్వాణసీతాదేవి యీమే యని తెలియవలయును.

## రామావతారం.

160. సంశయమనే తాటకిని జంపి, మనన యజ్ఞమును గావించి - బిందువనే, హరచాపమునుద్రుంచి - ఆనంద సీతను పరిణయించి, శరీరపఙ్క్తి రథునియాజ్ఞను, జాగ్రత్తైక-కయనుమతిచేత, సంసారవనమున, వతిఁ౦పవచ్చి,

రాగరావణుం డానందదేవినిం గొనిపోవ, వివేకాంజనీ సుతునిచేతం దెలిశి, మోహార్ణవ బంధనంబు గావించి, రాగరావణునిం జంపెను.

మాయాంగనాలక్షణం.

161. ఘోర సంసారమనే, దుకూలం గట్టుకొని, సుఖదుఃఖములనే కుచములమీద, భ్రాంతియనే కంచుకం దొడిగి, మోహమనే మందహాసంచేత, మనుస్సనే, ముఖమందు, రాగరోషములనే, కన్నులు దీర్ఘముగా మెరయ, జాగ్రత్స్వప్న సుషుప్తులు, పదకటి కంఠ భూషణములై యుండ, మూడుగుణములూ, మూడుముళ్లుగాగ, నెసగు మాయాంగన - సకల జనులను భ్రమింపజేయును - దీనిని నమ్మరాదు-

పరకాంతా వశ్యం.

162. ఒక పురుషుణ్ని, మరి వొక పురుషుడు, నీవెవ్వరన, నేను, మాయాపురంబుననుండి కాపరంచేస్తు వుండే పురుషుడను- నాకు ముగ్గురు భార్యలు గలరు, వారితో గూడి సంసారం చేయుచుండి, ఒకశిద్ధుడు గనుపడితే । పరకాంతవలచే ఉపాయం నాచేత అడుగబడి, అతడొక మూడు పదార్థాలుగూర్చి అందులో సారంతీశి నాకు యిస్తే, అది తీసుకొని ఆస్త్రీతోగూడితిని, ఆసౌఖ్యంయిట్టిదని చెప్ప శక్యముగాదు - యిదేబహాదురీ.

జనవశ్యము.

163. ఓకమహాత్ముడు ఒక వివేకునిం జూచి నీకుకావలశిన పరమరహస్యమడుగుమనినవిని, దేవ, రాక్షసులూ, లోకములూ, లోకేశులూ- భూపతులూ, భూజనులూ, స్త్రీలు, మొదలుగాగలవారు, వశమయ్యే వశ్యమిమ్మనిన, కరుణించి । ఆనందరసంబొసగి । అనుభవించుమని, మనాదీంద్రియముల సంగతి విడిచి, అంటుముట్టులు సోకకుండుమని, యిచ్చిన సైకోని, సకల జనవశ్యమును పొందినవాడాయెను. ఈవశ్యం అందరికి కావలశియున్నది.

రాజు.

164. ఒకడొకరాజునుంజూచి, నీవు యెవ్వరని యడిగితే, నేను రాజుననేను. అంటే, నీకు ప్రధాని యెవ్వరు, బుద్ధి. నిన్ను కొలిచే శేవకు లెవ్వరు, ఇంద్రియ సమూహము. 'రాజ్యమేది, సంసారం. అంతఃపురమేది, సుషుమ్న సింహాసనమేది, సహస్రారం. నీభార్య యెవరు, ముక్తికాంత. ముఖ్యభోగంయేది, అపరిమితానందం. అయితే నీవు యీపదవి, యెల్లకాలమూ, అనుభవిస్తూ వుండవలశినదని, నిన్ను నేను దీవించినాను, నాదీవెన తప్పదు.

ఇంద్రజాలి - ముచ్చట.

165. ఒకణ్నొకడు జూచి, నీవుయెవరని యడిగితే, ఇంద్రజాలిననేను, అంటే నీవేమేమి యెరుగుదువు, నేను

మెరుగనిది లేదు, రవి మెరుగనిచోటు, కవి మెరిగియున్న ట్టుగా, ఆమాట నాయందు నిజమై యున్నది, అయితే యేమిచేశినావు, మొదలు ప్రణవం, ఆవెనుక, శబ్దములు వేదములు, శాస్త్రములు, వివిధజగమ్ములు, చేశినాను చూడు మనెను. ఈ యింద్రజాలిని నమ్మరాదు.

వైద్యుడు.

166. ఒకణ్ణొకడు చూచి నీవెవరంటే, నేను అఖిల రోగములూ కొంచమైనా సోకకుండా, ఆపదలు పొందకుండా, ఆకలి, దప్పి, సుఖం, దుఃఖం, శోకం, మోహం, లేకుండా, వహ్నినాతా, తత, వర్షాదికముల చేత, ఇడుముల బడకుండా, మహావాక్య సంజీవనామృతమును తాగింప నేర్చిన వైద్యుణ్ని అని అనెను. ఇతడు మనకు అగత్యమైనవాడే.

గురు శిష్యులు.

167. గురువు శిష్యుణ్ని నీవు చాలా దినములనుంచి వేదాంత శాస్త్రాదులు చదువుచున్నావు పరమాత్మ వైతివా, అంటే- అయ్యా నేనుకాలేదు, అజ్ఞానిని, మూఢుండను. నన్ను రక్షించుమన్నినమస్కరించిన, గురుదక్షిణకిందికి దేహ ప్రాణ, మనస్సులు, గొని, వీటినంటకుమని, తిరిగీ వారియొద్దనే దాచినవాడాయను, వాడు దేహప్రాణమనో

తీతుడైయుండెను.

## దృగ్దృశ్యములు.

168. గురువు, శిష్యుణ్ని అడిగెను, నీవునన్నుగురువని యేలాగున, కనుకొంటివంటే, సూర్య కాంతిచేత, రాత్రి యెట్లాకందువో, దీపప్రభచేత, యిన్నింటినీ, దేని చేతగందువో, కంటిచేత, దాన్ని, దేనిచాత కందువో, బుద్ధిచేత మరిదాన్ని, యికనాకు తెలియదు, తెలుసవలె నంటె అదేబోధస్వరూపం - అదేపురుషుడు - అదేనీవుఅ నెను - విని యానందించెను.

## గురుశిష్యుల - రెండోముచ్చట.

169. గురువు, శిష్యుణ్ని, కంటివాస్వామినీ ఆనెను అనగా, శిష్యుడు కంటినినెను, యేకంటురా, లోకంట, యెట్లారా, లోకమెల్లగాను, శరీరేంద్రియ, ప్రాణజ్ఞాన శూన్యములుగాను, వీటినన్నిటినీ, నేనుగాననే, సచ్చి దానందమయుడనని, కంటి - కంటనని దేనితోటి అంటివి, కనలేను, కనకుంటే, శూన్యమా, కాదు, అదినేనేఅ యితె, నాసూటిచేత, అయితేసరిపాయ.

## స్నేహతులముచ్చట.

170. వక ఊకణ్ని, చూచియున్నాళ్లు యేదేశంపో యితివి, యేరాజును కొలిచితివి, అతిమురిపముచేత,

ముశిముశినవ్వులు, నవ్వుచున్నావు, నేనుసంసారాయా సముచేత వున్నాను, నన్ను నీవుపోయి వచ్చినచోటికి, తీసుకపొమ్మంటే, తనుమనఃప్రాణ బుద్ధులతో బోరాదు, వాటిని విడిచిపోదాము, అదేమార్గం, యిట్లాపోయిన డేరాజును దర్శించ్చును అతడే ఆశరీరుడు.

## బ్రంహ్మోపదేశం.

171. వకగురువును, వకశిష్యుడు, వోగురుమూర్తీ, బ్రంహ్మోపదేశం, చెయ్యుమంటే, వోగురుమూర్తీ, బ్రంహ్మోపదేశం చెయుమాయని, యాచించినవాడే। బ్రంహ్మ నన్ను బ్రంహ్మోపదేశం చేయుమంటే, నీవేబ్రంహ్మవని. చెప్పంగా, విన్నవాడే బ్రంహ్మ అనిచెప్పి తెలియకుంట్వే, మరివకతీరుగా చెప్పుతావినుమని, బ్రంహ్మ వస్తువెట్టిదో, తెలియకపోయను, దానితెలుసుకుందామని యత్నంచేశే వాడే బ్రహ్మ, ఆబ్రహ్మే నీవూ, నేను, కానిగురుమూల ముగా తెలియవలశినది.

## సుఖపుముచ్చట.

172. వంకిణ్ని వకడు అడిగేకదా, సమస్తసుఖాల్లోకి, ముఖ్యం అయినసుఖమేమి, అభీషతసుందరీసంగం, అదివ శంకాకపోయితే, దుఃఖమేకదా, అయినా, దానిసంగ్గము మెందాక సుఖమిచ్చును, సురతాంతందాక, ఆవల, అస

హ్యామవును, అలాగంటిసుఖము, యేమిసుఖము, యెప్ప
టికీ, వక్కతీరుసుఖము, చిత్సుఖమేననెను, యితరసుఖ
ములన్నీ। దుఃఖములేను. చక్కగాదయచేశి విచారించు
కొండి.

## దశావతారములు.

173. పదిపదియేండ్లకు వక్కొక్క, అవతారముజరుగు
నూ, యీచొప్పుననూరు యేండ్లలో, పది అవతారములు
జరుగును.

## గురుశిష్యులుండవలసిన న్యాయములు.

174. మర్కటి కిశోరన్యాయము, మార్జాల కిశో
రన్యాయము, మండూక, కిశోరన్యాయము, భ్రమరకీ
టకన్యాయము, యివితప్పితే, అధికముప్పేను.

## నిజగురుశిష్యుల ప్రశ్నోత్తరములు.

175. ప్ర॥ భూమిమీది నీళ్లుఅన్నీ విడచి మేఘోదకా
నికే, చాతకపు పక్షియే తీరుగానోరు తెరుచుకొనివుం
డునో, ఆతీరుననే అన్నిముచ్చట్లు వినుటమాని, గురుము
ఖోద్గత, వాక్యములు వినవలెను. విన్నవి, మననంచెయ్య
వలెను, తదనంతరం, నిజధ్యాసను తెచ్చుకోవలెను.

## గురుదక్షిణ.

176. ఉ॥ యేదేది నాశమవునో, యేదేది ఆశాశ్వత
మో, ఆది నాకు గురుదక్షిణగా యివ్వవూ, నాకయ్యితే

పట్టదుగాని, మీవద్దనుంచి విడిపించేటందుకు, అడిగినాను, యిదిగాక భూషణాలు, భిక్షుకుణికి, భిక్షములో వేస్తే, యింద్రపదవి, చేకూరినట్లు, గురుదక్షిణగా, నాశవంత పదార్థమంతా। యిస్తే, నాశనరహిత పదప్రాప్తి। అవుతుందీ - కనక, నీ దేమిపాయె, యివ్వరాదా.

177. ప్ర॥ స్వామీ, నాశవంతమైన, పదార్థాలు యేవో, వాటిని దెల్యజెప్పి తేవిడవగలను, నన్నుమీవంటివాన్నిగా, చయ్యవలశినదీ, నన్నుఉపేక్షించవద్దు.

178. ఉ॥ శిష్యామనస్సు చంచెలమాని, ఒకర్మానసుతో విను, మనస్సు చంచెలంమాయనేని, సందేహ సముద్రమందు, మునిగి పోతావుసుమా,

179. ఇనుము అగ్నిచేతకాగి, సంపెటచేత దెబ్బలుబడి పరసవేదితో, జగడించెనా బంగారమవున్నూ,ఆయినుము, విమలవిమోచనం, కాకపాయనా, కేటుబంగారంఅయినట్టు, నాశవంతపదార్థం అంతమలంగక,దాన్ని సమూలముగా, విడచి, శాశ్వత పదార్థాన్ని,గురుతెరిగితివా, ధన్యుడవవ్యేదవు, మాయా, మయమైన ఆశాశ్వితపదార్థాలు, యేవంటే తెలిపెదనువినుమని, చెప్పనారంభించెనూ.

మాయారూపము.

180. అహం, అనేస్ఫురణ, యేదిగలదో, అదిమాయ, దానికిత్రిగుణాలుపుదయించే, గుణములవల్లపంచభూతము లుబుట్టే, వీటివలన దృశ్యాదృశ్యాత్మకమైన, ప్రపంచోత్పత్తి ఆయనూ, యిదిఅంతామాయయేసుమా, వకటీమాయ యే, రెండుతునకలై, ప్రకృతి। పురుషలాయను, జ్ఞాత, జ్ఞే య, జ్ఞాన, ధ్యాతా, ధ్యేయా, ధ్యాన, సత్తు, చిత్తు, ఆనందం, ఆత్మ, బ్రంహ్మ, స్వరూప, రూపం, అరూపం, జీవుడు, శివుడు, ఈశ్వరుడు విశ్వరూపం విశ్వంభరుడు, యివి అన్నీమాయే - సుమా.

మనస్సును ఆడించేది మాయ.

181. బుద్ధియందు వ్యాపించేదిమాయా - అనేకమని యన్నా, ఏకమనియన్నా యీరెండు, మాయ, యేనూ,

మాయయే, దేహమును, నడిపించునూ, మాయే, శబ్ద మును పలికించును, మాయే, నేత్రాలలోజొచ్చి, దృశ్యా న్ని జూపించును.

మాయను నడిపేది మాయే.

మాయతోటి, మాయే మాట్లాడును.

మాయనుంచే మాయ చలించును.

మాయ, వాయురూపం.

శిష్యుని ప్రశ్న.

182. ప్ర॥ స్వామీ స్వరూప సత్తాచేత, మాయ నడుచుననీ, వినివుంటిని, అది అబద్ధమా, నిబద్ధేనా, అని అడిగెను.

183. ఉ॥ వోరీ, సత్తా అన్నప్పుడు, అదిన్ని మాయే లేని మాయాస్వరూప సత్తాచేత, నడిచినదంటే, యేమిని బద్ధరా, యీమాట అనేటందుకు, శిగ్గన్నారాదుగా.

184. ప్ర॥ స్వామీ అంత్తామాయే, అంటిరి మాయా పుట్టనే లేదనీ, మళ్లీ అంటే, నేను యేమి చెయ్యావలెను.

185. ఉ. వోరీ నీమనస్సుకు. యేదేది అనుభవానికి వచ్చునో, అదెల్లా మాయయేఅని, తెలిసివిడిస్తే, చాలు, సుమా.

సకలం, మాయఅని, చెప్పి, యీమాయ, స్వరూపముతో, లేదని చెప్పితినీ, యీలేదనే, మాటనుకూడ, మాయే, అని తెలుసుకో, మాయకు మాయె కనుపడును, మాయకు మాయే ప్రకాశించును, మాయనుంచే, లాభం గద్దూ, ఆలాభం పరమార్థ స్వరూపపుది, మాయే భవ సముద్రమును దాటించేది, మాయే, జీవుని వుద్ధరించేది, మాయనుంచే, దేవుడును భక్తుడు, మాయనుంచే, తెలిసినవాఁడు విరక్తుఁడు

మాయనుంచే జీవన్ముక్తుడవును.

మాయనుంచే వేదములు, శాస్త్రములు.

మాయనుంచే, నానావ్యుత్పత్తి.

మాయనుంచే మూఢుడవ్వేది, వివేకుడవ్వేది.

మాయె పరమార్థునికి అంజనం.

మాయనుంచే, నిధానం దొరికేది.

మాయనుంచే సావధానస్థితి కుదిరేది.

మాయనుంచే, స్వహితమవును.

మాయనుంచే, భ్రాంతికలిగేది.

మాయనుంచే, ప్రపంచభావన తొలిగేది.

మాయలేకుంటే, జ్ఞానము యెక్కడిది.

మాయే జీవనకళ అనబడును.

సాధకునికి మాయలేక, కార్యము జరగదు.

మాయలేక పరమార్థము దొరకునంటే, యెన్నటికి దొరకదు.

మాయయనగా, యిక్కడ యుక్తాయుక్త విచక్షణగా, అర్థమును గ్రహించ వలసినది.

అయుక్తముగా అర్థము చేసుకోగూడదు అని చక్కగా తెలిసేది.

బృహద్వాసిష్ఠోక్తి మాటలు.

186. శరీరమువొక్కటే, కాని, దీని లోపటవున్న పేలుగా అనేకాలు, జ్ఞానముఅని,అజ్ఞానముఅని, ఇంద్రియములు అని, విషయములు అని, గుణములు అని, అంతఃకరుణ అని, మనస్సు అని, బుద్ధిఅని, చిత్తము అని, అహంకారమని, వేదములు అని, శాస్త్రములుఅని, యన్నిఅని, వ్రాయుదును, యీశరీరమందు స్వగతభేదములు అనంతములు, వున్నవి, తీశివేశినా, కొదవ మొలుస్తావి, వున్నవాటికి లెక్కలేదు, పోయినవాటికి లెక్కలేదు, వ్రాయ శక్యముకాదు స్వజాతీయ, విజాతీయ, స్వగతశూన్య మైనది, యీబట్టబయలు, యీపరిపూర్ణానికీ, బదులు లేదు, యీ కేవలాత్మకు, శరీరము లేదుగనుక, స్వగత భేదములు యన్నటికిలేవు, యేమిలేని, బట్టబయలులో, యేమిలేక వున్నవారే పరిపూర్ణులు, యీశరీరం, వున్నంతశేపు, కలేకాని, మరివొకటి లేదు అందరూ స్వప్నవస్థ చేతనే వున్నారు జాగ్రత అయితేనే కలతోచి జాగ్రతలేకమునువు యీశరీరము యేమిలేదు కనుక వ్యవహారమే లేదు, వ్యవహారమునకు మూలం, యీగుర్తెరిగే, జ్ఞానమేకాని, మరివొకటిలేదు, గుర్తెరిగే జ్ఞానంపుట్టంగానే కలశిద్ధం, యీ కలలోనే, అనేక చిత్రవిచిత్రాలు, వుత్పత్తి అవుతావి, వెంటనే యేమిలేదు, యెంతవారు కలకంటు

నే వున్నారు, కలరాకమనుఫు, గుర్తెరిగే శరీరము, లేనే లేదు, కనుక మొదలుకొనలేని బయలు తనకుతానే, స్వత సిద్ధమై చలించక వున్నది.

ఇతి సంపూర్ణం.

గ్రంథముల రుచిసంగతి.

187. లోకములో - శుద్ధసంసారి ప్రవర్తన, మంత్ర యోగికి రుచింపదు, మంత్రయోగి వర్తన, లయయోగి కోరదు, లయయోగి ప్రవర్తన, హటయోగికి, పట్టదు, శుద్ధసంసారి, మొదలైన యీనలుగురి ప్రవర్తన, రాజ యోగికి, పట్టదు.

188. యీతీరుగనే, హరిహరావతారకథా, శ్రవణ కుతూహలులైనవారు, బొబ్బిలికథ, బలువూరి కొండయ్య కథ, తందాన పదములు మొదలైన, కథలను, విన నిశ్చ యించరు,

189. వేదాంతశ్రవణ పరాయణులకు, అవతారాది కథలు రుచింపవు, నాస్తికమును శ్రవణం చేశేవారికి, పైన జెప్పిన నాటియందు, నిరాదరణ సంభవించును, శ్రీ, శివ రామ దీక్షితీయ్యా కరణోత్సాహ, మానసులకు, అవ్వి, యేవీనిని, రుచింప నేరవు.

190. పరిపూర్ణ బోధగల, మహాస్త్రీయ్యులు, ఇతరు లను దూషింపరు - దూషింపగా వినరు, అట్లా, దూషిం

చినా, దూషణలువిన్నా, అట్టివారికి యెన్నటికి దరి దొర
కదని నమ్మవలశినది.

నిజగురు ద్వాదశ నమస్కారం.

191. శ్రీసమంచిత మవ్యయం పరమ ప్రకాశమగో
చరం । భేదవర్జిత మప్రమేయ మనంతమాద్యమ కల్మషం
నిర్మలం నిగమాంత మద్వయ మప్రతర్క్యమభోధకం।
ప్రాత రేవహిమాన సాంతభావ ఏద్గురు పాదుకం॥ ౧॥
నాదబిందుకళాత్మకం దశ నాదభేద వినోదకం । మంత్ర
రాజ విరాజితం నిజమండలాంతర భాసితం । పంచవర్ణమ
ఖండ మద్భుత మాదికారణ మచ్యుతం॥ ప్రా॥ హంసచార
మఖండ నాదమనేక వర్ణమరూపకం । శబ్దజాలమ యంచ
రాచర, జంతు దేహనివాసినం । చక్రరాజ మనాహతో
ద్భవమేక వర్ణమతఃపరం । ప్రా॥బుద్ధిరూపమబుద్ధకం త్రిత
యైకకూటని వాసినం । నిశ్చలం నిరత ప్రకాశకనిర్మలంనిజ
మూలకం । పశ్చిమాంతర ఖేలనం నిజశుద్ధసాఖ్య విగో
చరం॥ ప్రా॥ ४॥ హృద్గతం విమలం మనోజ్ఞా విభాసితం
పరమాణుకం । నీలమధ్యసు నీలసన్నిభమాది బిందు నిజా
శంకం । సూక్ష్మకర్ణికవాసి నంజల వహ్నిరూపక మీశ్వ
రం॥ ప్రా॥ ౫॥ వ్యోమవద్బహిరంతరస్థితమక్షరం నిఖి
లాత్మకం । కేవలం పరిశుద్ధమేక మజన్మహిప్రతి రూపకం।
బ్రహ్మతత్వవి నిశ్చయం నిరతాను మోక్షమబోధకం॥ ప్రా॥

౬॥ పంచవర్ణశుచివిర్ణచిత్ర విశుద్ధతత్త్వవిచారణం।చంద్ర
సూర్యచిదాగ్ని మండల మండితంఘనచిన్మయం।చిత్కళా
పరిపూర్ణమంతర చిత్సమాధినిరీక్షణం॥ పా॥ ౭॥ పంచ
ముద్రసులక్ష్యదర్శనభావమాత్మ నిరూపణం । విద్యుదా
దిధగద్గగిత, రుచివిర్ణనోదవి వర్ధనం । చిన్ముఖాంతర
వర్తినం సదసద్విలాస మమాయకం॥ పా॥ ౮॥ పంచ
పంచహృషీక దేహమనశ్చ తుష్కపరస్వరం । పంచభూ
తనకామ షట్కసమీరశబ్ద ముఖేతరం । పంచకోశగుణత్ర
యాదిసమస్తధర్మ విలక్షణం॥ పా॥ ౯॥ జన్మకర్మనివా
రకం, రుచిపూరకం, భవతారకం । నామరూపవివర్జి
తం నిజనాయకం సుఖదాయకం॥ పా॥ ౧౦॥ తప్తకాంచన
దివ్యమాన మహాణుమాత్రను రూపకం । చంద్రకాంత ర
తాకరై, రసముజ్వలం పరమంపదం। నీలనీరద మధ్యమ
స్థితవిద్యుదాభ విభాసితం॥ పా॥ ౧౧॥ స్థూలసూక్ష్మస
కారణాంతర ఖేలనం పరిపాలనం । విశ్వతైజస ప్రాజ్ఞచే
తస మాంతరాత్మనిజాంశకం । సూక్ష్మకర్ణక వాసినంజల
పద్మరూపక మీశ్వరం॥ పా॥ ౧౨॥

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమచ్ఛం
కరాచార్య విరచితం శ్రీగురుపాదుకాస్తోత్ర సమాప్తః॥

1. మనాపుండరీక వరద - హరివిఠేల్
2. రాజారామచంద్ర మహారాజుకీజై

3. నమఃపార్వతీపతే - హరహర మహాదేవ

4. శ్రీమద్భాగవత శ్రీకృష్ణదేశిక పరమగురు మహారాజుకీజై

5. శ్రీమత్ - ఫీల్ఖానా శ్రీశంకరదేశి ప్రభూస్వగురు మహారాజు కీజై

పరాకు తెలుపుట.

6. భక్తాభిమానీ, శ్రీశంకరప్రభూ, యోగీ మహారాజా బహుపరాక్

7. అనాద్యవిద్యా - మాయానిర్మూలన - అద్యంతర హితా బహుపరాక్

8. అశరీరప్రవర్తకా, సకలవేదవేదాంత సారార్థాతార్యానుమత సంచరా బహుపరాక్

భజన.

హరశివశంకర భోలానాథ్, పతీతపావన పండరినాథూ.

మనాపుండరీక వరదహరివిఠేల్

శ్రీనిజగురుప్రభూ, మహారాజ కీజై.

అథా.

భక్తజనకృత, నిజగురుస్తవ కీర్తనలు, ప్రారంభః.



శ్రీనిజగురుప్రసన్న.

శ్రీమంతు ఫీల్ఖానా, శ్రీశంకరదేశిక ప్రభుసమర్థ.

శ్రీమదనంత లక్ష్మీసమేత, శ్రీమద్భాగవత

శ్రీకృష్ణదేశిక ప్రభు సమర్థ.

శ్లోకం॥ శ్రీవత్సగోత్ర కలశాంబుధి పూర్ణచంద్రం। శ్రీకృష్ణ పాద కమలామృత పానభృంగం। శ్రీఫీలుఖాన, వంశాంబుధి రేవజాతం। శ్రీశంకరార్య స్వగురుం మనసా స్మరామి॥ (౧)

శ్లోకం॥ వేద వేదాంత పారిణం। భక్తాభీష్ట ఫలప్రదం। సర్వాతీతమనిర్వాచ్యం। శంకరేంద్రంనమామ్యహం॥(౨)

కీర్తన.

నాటరాగం, ఆదితాళం.

పల్లవి.

గణపతిని న్నేనమ్మితి। నమోస్తుతేగణపతిని న్నేనమ్మితి॥

అనుపల్లవి.

గణనాయకా రారా। గౌరికుమారా। ఓ। ఫణిరాజ భూషణ పరిజనపోషణ॥ గణపతిని న్నేనమ్మితి॥

చరణము.

కొనియాడిభాగవత, కృష్ణరాయగురు । డనుపగాజని, ఫీల్ఖానా, శంకరుబ్రోచే ॥ గణపతీ ॥ నమోస్తుతే. (౧)

గౌరాజు, హరిరావు కొమారుడు, లక్ష్మీపతి దాస్, స్వచ్ఛప్రకాశానందు, దేశపాండ్యా, పాషన్నపేటు, తాలూకే, టేకుమహల్, జిలేమెదకు ॥ గారికృతం ॥

శ్లోకం ॥ సచ్చిత్సుఖమాత్మానం । శ్రీమచ్ఛంకరదేశికం । ప్రణమ్యశిరసానిత్యం । హ్యాజ్ఞానధ్వాంతదీపినం ॥ (3)
శ్లోకం ॥ అఖండసచ్చిదానంద । మద్వైతామృతసాగరం । నమామిచిన్మయాతీతం । శంకరార్యంసదాహృది ॥ (౪)

౧. కీర్తన.

కమాచిరాగం, ఆదితాళం,

పల్లవి.

వందనము గురురాయ స్వామిణా, బృందమందిరా ॥ వం॥

అనుపల్లవి.

మందహాస సనంద మునిజన । బృందపూజిత యిందు వదనా ॥ వందనము ॥

## చరణములు.

తల్లిదండ్రివి దాతవీవని। తగనునమ్మితినీ। యుల్లమున రంజిల్లమీపద। పల్లవంబులుమదిలోనమ్మిక॥ వంద॥ (౧)

సారెసారెకు మిమ్ము జేరితి। దారిజూపగదే। వారిపీరిని జేరిమదివే। సారిమీదరిజేకుకుంటిని॥ వంద॥ (౨)

కరుణజేసియు మమ్ము బ్రోవుమి। కంబు కంధారా। శరణుమీకని నమ్మినాడను। వరులగోరనీ। వసుమతిలోన॥ వందనము గురురాయ॥ (3)

భాగవత, శ్రీకృష్ణ దేశుకు। భావమును నమ్మి। యీ మహిని పరిపూర్ణ బోధను, బాగుగను మదినుంచుమీకిదె॥ వందనముగురు॥ (౪)

ప్రేమ కర్ణనాంపల్లినగర। స్వామి శంకరా। నామది నివదలించుసంశయ। మేమరకసూనీమచరితా॥ వం॥ (౫)

## శ్రీసద్గురు మహారాజుకీజై.

ఉ॥ శ్రీవత్సాంకిత గోత్రసాగర మహాంభోరాశి సంజాత। దుర్వృత్తా నూన సదా నిరంజన. కళా చిన్మాత్ర వైదేహ। భాస్వచ్ఛా నాత్మ పరాత్మ రూప నరసింహాఖ్యా సర్వామాంబి। కస్వచ్ఛా గర్భ మమౌక్తికం వర గురుం శ్రీశంకరార్యం భజే॥ (౧)

ఉ॥ రజతాద్రిఁ బ్రమథాదులఁ నగసుతఁ రాకేందునిఁ నందినిఁ । గజతుండా ననుబాశి భక్తులకటాక్షించంగవేచూనియూ । నిజసామర్థ్యము జూపవేడుకను తా బుట్టెఁధరఁ శంకరుం । డజుడౌ శంకరరాయ దేశికులు యాన్తారత్నుణోద్వితృష్టై ॥ (౨)

## ౨. కీర్తన.

రేగుప్తిరాగం, ఆదితాళం.

### పల్లవి.

శ్రీమాఁ, భాగావతకృష్ణరాజా । యోగీంద్రుసభలో, ప్రేమాతో శివ్యటి సమాజా । మతిభక్తిచతుర్విధ సేమా, శత్రుమాలుఘనసాంబ్రాజ్యామా, దేశికేంద్ర స్వామీకే, చెల్లు నిహాపరపూజా ॥

### అనుపల్లవి

శ్రీమాఁ న్నారాయణుడు మున్నిమాహా నీయ్యాముత్తిని, భూమీ ప్రార్థించాగ పామార నరులకొరకై ॥ య్యానుహీనీ । భాగవత కృష్ణగురు, స్వామియనీ ॥ కొని యాడగ జననంబై మనుజులగని, ప్రేమమీర పరిపూర్ణ బోధయును । నీమములోడుత నెరుకదెలిపి । నిష్కాముడ

వని ఫీల్ఖాన, శంకర శ్రీమంత్తునకా, నామమునిలిపెను ॥ శ్రీ
మార్గ భాగవతకృష్ణరాజా ॥ (౧)

భూసురోత్తములుగూడి బాగా । చనుదెంచుచు నిగ
మాభ్యాసా, కోటూలు సాభగాగా । గురుదరిశించగవన,
వాసూలందారు జేరీరాగా । అతి ముదముతో పరమో ।
ల్లాసూలై జనులుండగ మరివేగా ॥ దేశికేంద్రుడు ప్రముదు
సిం । హస్యాసానాశీనుగాగా । దాసా దాసూలు భజనలు
జేశి డాసీ । కైసాచీ । శ్రీసద్గురు పదములపై, సేచ్ఛి ॥
మిప్రణల్లిక్రుతార్థులజేశి, భవాంబుధి । రాశినిదేల్చి । నిరా
సగ భవదుప, దేశములిమ్మని । దోసిలొగ్గి వినుతించి । భ
జించిరి । స్సాస్సరిగపధని, స్వరమలరింపుచు ॥ శ్రీమార్గ ॥ (౨)

మోదమందాగ సుజనులవారూ, దీరాగ । సద్గురు ।
పాదాబ్జములకు మ్రొక్కేవారూ । దక్షిణతాంబూల ఫ ।
లాదూలా, గురున కంపించేరూ । యిరువంకల జేరుక,
సాధూల్వింఝూమరలూ వీచేరూ ॥ భేదాభేదా మనుచు
వా, గ్వాదాములాడుకొనుచు । మోదామూతోడఆవలిచే,
బో । రాదీయ్యు । సద్గురుబోధలకూ ॥ ముదమందుచుమా
యోపాధులకూ ॥ బడలేమని వేడుచు । సాధకము మనో
వ్యాధి యనుచు గురు । నాధునికరుణ । పయోధిమునుం
గుచు । తాత్త్వరికిటధిం । తఝూం, ఝుణుతయని ॥ శ్రీమార్గ ॥ ౩

మనా పుండరీక వరద హరి విఠేల్.

ఉ॥ గోల్కొండాఖ్య పురంబు వీడు పురియై గోవేల నాంపల్లియై। లీలామానవ దేహులైపరమనిత్యానందసమ్మో దులై। శ్రీలాలిత్య సదా నిరంజన సమాధి స్థాణులై కృష్ణ సద్గురు। లీలోన్మిత శంకరార్యులను భక్తిఁ గొల్తు నెల్లప్పుడున్॥ (3)

ఉ॥ సదసత్సంగతి నామరూపగుణ దృశ్యంబైనవిశ్వం బుఖిం। మద మోహాదిక కోర్కెఁ తామస రజస్సత్వా దులన్ ద్రుంచి తా। విదులై బ్రహ్మ పథస్థులై ఖలుజనా జాతాఘనారణ్య। నిదహహులౌ శంకర దేశికేంద్రు చర ణంబుల్ గొల్చెదన్ భక్తిచే॥ (౪)

3. కీ ర్త న.

భైరవి రాగం, ఆటతాళం.

ప ల్ల వి.

శ్రీమంతులైనట్టి శ్రీశంకర ప్రభు శేవజేతమురారే। ఓ చెలులారా॥

అ ను ప ల్ల వి.

కామించి వారిని గన్నట్టి తలిదండ్రు। లేమి నోములు నోచిరో। ఓచెలులారా॥ (౧)

చరణము.

రమణీయ్యస్వాంతమై, రాజిల్లు బ్రహ్మము। సమక్రియ బోధింతురే। సద్భక్తులకూ ॥ శ్రీమంతు ॥ (౨)

మూలాము లేని గుర్తెరిగే శరీరాము। జోలి విడిపింతూరటే। ఓచెలులారా ॥ శ్రీమంతు ॥ (3)

శ్రీభాగవత కృష్ణ ప్రభు పీఠనివాస। శంకారమంత్రి స్వామే। ఓచెలులారా॥ శ్రీమంతు ॥ (౪)

సంగీతావిపరమ, సత్కాలక్షేపణ। సంగాఖ్యదాసూడు। సలుపుచున్నాడాట ॥ శ్రీమంతులైనట్టి॥ (౫)

నమః పార్వతీపతే హరహరమహాదేవ.

ఉ॥ ఆనందాంబుధి పూర్ణ చిన్మయ ప్రకాశానంద సమ్మోద స। న్మానా మాన వివర్జ నిత్య నిరపేక్షావస్తు సంశోధ॥ భిన్నా భిన్నాత్మక సత్యసంధి పరతత్వాభాసులైవెల్గుశ్రీ। జ్ఞానా శంకరదేశికేంద్రు చరణంబుల్, గొల్తు నిష్టార్థికిన్ ॥ (౬)

ఉ॥ భక్తుల కల్పవృక్షమయి భాసిలు చుండిసుబోధచేత యా। భక్తులు ముక్తులౌగతిని బాగుగ సత్కరుణించి జ్ఞాన వి। రక్తినొసంగి నిశ్చయ మనస్సులచే తమ రూప మిచ్చుస। న్మక్తశిరోమణీ ప్రభుల సారెకుగొల్చెద శంకరార్యులన్ ॥ (౭)

## ౪. కీర్తన.

బేగడరాగం, ఝంపతాళం.

### పల్లవి.

రామ, కృష్ణ, శంకర, జయరాజసేవితే । ఆదిమధ్యాంత రహిత అచలధీమతే ॥ (౧)

### అనుపల్లవి.

జన్మమరణ కర్మరహిత జానకీపతే । ధర్మమర్మనిర్మలాత్మ ధాతసన్నుతే ॥ రామకృష్ణ ॥ (౨)

రాధరుక్మిణీసమేత బోధరూపతే । మాధవ శ్రీకృష్ణదేవ మద్గురూనతే ॥ రామకృష్ణ ॥ (3)

గంగగిరిజసహిత ప్రమధగణసుపూజితే, సువిమలాత్మ సుందరాంగ సుగుణభూషితే ॥ రామకృష్ణ ॥ (౪)

భాగవతశ్రీకృష్ణ మూర్తిబోధజీవితే । ఫీలుఖాన శంకర ప్రభురాజయోగితే ॥ రామకృష్ణ ॥ (౫)

శ్రీసద్గురు మహారాజుకీజై.

ఉ॥ దృగదృశ్యాత్మక సాక్షియయ్యు దృశువై దృశ్యంబునై దృష్టియై । లోకంబైనవి గాకయై నొకటిగానై లోకాత్ముడై లోపమై । యేకానేకములై యథేచ్ఛరతు

హై యేకాంతుహై పూర్ణుఁడై । రాకాపోక చిదాత్మ
శంకరగురుం । రంజిల్లుచుఁ గొల్చెదన్ ॥ (౬)

ఉ॥ శంకర దేశికేంద్ర చరణంబులు గొల్చెటి భక్త
శ్రేణిలో । గొంకుచునున్న శ్వానముఖ కూతలు గావున
దప్పు లున్న నా । వంక కృపా దృఁగ్దృష్టి నిడి వాక్కున
యష్టకపద్యముల్ మదిన్ । జెంక్కకస్తోత్రరూపమున ధ్యా
నము సేయుడు శంకరార్యులన్ ॥ (౭)

కం॥ అష్టకపద్యము లెప్పుడు । నిష్టతో పఠియింప ము
క్తి నిలయము వేగన్ । యిష్టమున శంకరార్యులు । స్పష్టంబుగ
నొసగగలరు సత్యముసుమ్మీ ॥ (౮)

శంభుని వీరదాస కృతం.

.. . ౫. కీర్తన.

శంకరాభరణరాగము. ఆదితాళం.

పల్లవి.

విన్నందుకు కనులగన్నందుకూ ॥ మిమ్మూ ॥

అనుపల్లవి.

యెన్నోవిధమూలనైన । సన్నూతిజేతుమీకు । నన్నాద
రించెవార, లున్నారవేరె యాఘను. ॥

## చ ర ణ ము లు.

భూసూర శ్రేష్టులయ్యు, వాశీకేక్కినవారు । ఆశ్రించి యున్నయట్టి వాసూలబ్రోచేరనుచు ॥ విన్నందుకు ॥ (౧)

కృష్ణాయోగీంద్రులాకా । భీష్టామొచ్చియు మంమ్మూ। శిష్టూలజేశేకొరకు । సృష్టీజేశేరిమిమ్మూ ॥ విన్నందుకు॥ (౨)

యోగాసాధానమాకు । వేగీరముగనుదెల్పి । ఆగామి కృతములెల్ల । పోగొట్టేవారలనుచూ ॥విన్నందుకు॥ (3)

మాయాను వదులాగొట్టి । మీయాజ్ఞ, పైనాపెట్టి.। చేయారానట్టిక్రియలో। చారానివ్వారాటనుచూ॥విం॥(౪)

మందాబుద్ధూలచేతా, యిందాకవుంటినైతె । పొందూగమిమ్మూజూడ । సందేహామొదిలెనాకు॥వింన్నం॥ (౫)

వాశీగనాంపల్లి, వాసూలై భక్తులానూ । పోషించుచున్నారనుచు చూచితినేడుమిమ్మూ ॥ విన్నంధుకు ॥ (౬)

శంకాలేకయీూ, ధరలో, వంకాత్రోవాలునడచే । సంకరా జనశీఘ్రాకై । శంకారులైనారనుచు ॥ విన్నం ॥ (౭)

వీరాదాసూడుమిమ్మూ । వేమారకెపుడుదలచ । ధారాళమైనసీతి । దయజేశినారనుచు ॥ విన్నందుకు ॥ (౮)

మహాలమళ్ల వేంకటరామారెడ్డి సమస్థాన్

వనపర్తి, దేశముఖుగారి కృతం.

మ॥ కలుష వ్రాతమడంచి భూరి మదనాగ వ్యూహ
ముం ద్రుంచినా। తలపై శ్రీకరముంచి [illegible] దద్వం
ద్వముర్ జేర్చిభా। సిలగా నా[illegible] ముపదే
శించం గృతార్థుండనై। తి[illegible]శంకర దేశికాన్వయమ
ణీ దీనార్థిచింతామణి॥ (౧)

మ॥ పరముక్త ప్రమదా[illegible]దర్పణము పాప ధ్వాంత
సంఘాతభా। స్కర బింబంబో[illegible]తరీక్ష లసదబ్జద్యు
వృత్తంబుత్వ। త్కరకంజోద్భవ [illegible]
జోతిరూపంబునీ। చరణాంభోజ నఖంబు శంకర కృ
తీ స్వాంతంబునన్ దల్చెదన్॥ (౨)

మ॥ తలపన్ దేశికశంకరాఖ్య - తలిదండ్రుల్ పుత్రు
లున్ మిత్రులున్। గల రబ్జాక్షులు జన్మ జన్మమున దుః
ఖంబుల్ నివారింతురే। మెలమిన్ దన్నెరుగంగ జేసెడి గు
రుం డీవబ్బగా నీవణా। దులు దీరెన్గద నీవెనే నైతి
నా। దుష్కర్మముల్ బాసెగా॥ (3)

చ॥ జపతపముల్ సమాధియును సాంఖ్యవనాటిమరు
న్నిరోధముల్। చపలమతిం వచించకనె శైలము లెక్క

క తీర్థయాత్రలం । దపరిమితప్రయాసములనందక మీరలు
దెల్పుమంత్రమే । శ్వపచుడు బల్కినంతటనె శంకరదేశిక
మోక్షమబ్బదే ॥ (౪)

శ్రీశంకరదేశిక ప్రభుమహారాజు కీజై

౬. కీ ర్త న.

కల్యాణిరాగం, ఆదితాళం.

ప ల్ల వి.

ఎందుకుసంశయ । మొదవెనుసీమది । ముందుగపరిపూ
ర్ణమున్నదె మనసా ॥ ఎందుకుసంశయ ॥

అ ను ప ల్ల వి.

సారరహితసం, సారముననుబడి । దారిదెలియకను త
త్తరపడియద ॥ వెందుకుసంశయ ॥ (౧)

నాది నీది యని । వాదము శౌయక ।పాదుగ నిలచిన
బ్రహ్మము గనకను ॥ ఎందుకుసంశయ ॥ (౨)

సాధనరహిత ఉపాధిదెలిపెగురు । పాదయుగళములు
భక్తితోనమ్మక ॥ ఎందుకుసంశయ ॥ (3)

ప్రేమమీర శ్రీ శంకర ప్రభు పద । నేమము దప్పక ।
ధ్యానమువిడచెద ॥ వెందుకుసంశయ ॥ (౪)

ష్ణనాపుండరీక వరద హరి వి ఠేల్.

సీ॥ ఆచార్యులే దైవమని ఘంటికాయుక్త కాంచన భే
రి వేయించగలను। నగురోరధికమంచు నగరి వీధులలోన
డిండిమ ధ్వనుల సాటించ గలను। వరుసన దేశికా త్పర
మంచు వ్రాయించి కంచు కంభంబు పాతించగలను। శ్రీ
గురువర్యులే చిద్రూపమై రంచు శివునితో నైనభాషించగ
లను। సూచిక నిషిద్ధబోధక పాచకాది। దేశికులలోనకా
రణదేశికేంద్రుడని। వచించెద మజ్జన్మ హారుని హారిని।
హారునిబోలెడి శ్రీశంకరార్యగురునీ॥ (౧)

సీ॥ యుష్మ త్పదక్షాళనోత్కృష్ట తీర్థమెవ్వాడు గ్రో
లు వాడెపో భవహరుండు। మీప్రసాదంబు యే మేటి
శేవించునో వాడెపో కలుష నివారకుండు। తావక పద
సేవ తాసల్పు నెవ్వడో వాడె ముక్త్యంగన వల్లభుండు।
భవ దుపదేశంబు భావించు నెవ్వడో వాడెపో సుజ్ఞాన
వర్ధనుండు। త్వత్ప్రతీక వరధ్యాన పరుడెవండో। వా
డె సారూప్య పదవిని దాసుడౌను। ధైర్య జిదహార్య
వేదాంత తత్వధుర్య। శరధి గాంభీర్య శంకరాచార్య
వర్యా॥ (౨)

ఉ॥ వేమరు కామితార్థములు వేల్పుల ధేను వొసం
గునింకచిం। తామణి చింతితేష్టమును దా నొనగూర్చు
ను కల్పితార్థములో కాలముకిచ్చుకల్పకము। కామిత,

చింతిత కల్పితేతరో । ద్దామ పరంపద ప్రదము । తావక
మంత్రము శంకరాగ్రణీ ॥ (౯)

గీ॥ హృదయపంకేజపరిమళంబిడిదలంప । మానసస్థంభ
మణిదీప మాలికయును । చిత్తవ పణ్ణ తేజంబు చెన్ను
మీర । శంకరాచార్య మీమంత్ర సారమరయ॥ (౧)

కం॥ శంకరసమత్వైవల్యవ । శంకరసాష్టాంగ యోగ
శంకరభవనా । శంకరవాది భయంకర । శంకరగురురాజ
ప్రణవ ఝూంకరణపితా ॥ (౨)

మంగోలు కృష్ణదాసు కృతం.

౭. కీ ర్త న.

కరహరప్రియరాగం, ఆదితాళం.

ప ల్ల వి.

నాంపల్లి పుర విహార । నయగుణా ధీరా ॥

అ ను ప ల్ల వి,

అచల సులోచన అమితవిమల సుఖ । సుచరిత వందన
సుందర రూపా ॥ నాంపల్లి పురవిహారి ॥

చ ర ణ ము.

కరుణాకటాక్ష శూరా । కలుషా సంహారా ।దీ న ద
యాకర దివ్యపురుషనుత । భాను తేజముఖ భవ్యసుచరితా ॥
నాంపల్లి పురవిహార ॥ (౧)

పరిపూర్ణమిదిగో యిదిగో । పాటించి కనుమిదీ । యనుచు శీఘ్రముగ వినజేశియు నా । కనుల జూపి ననుకడతేర్చిన స్వా ॥ నాంపల్లిపురవిహార ॥ (౨)

ఎటుకాతో పొందువిడచి । యెరుగూ నిజగురువునూ । వరమిచ్చును వినువసుధ లోపలను । పరమపథంబును భాటని తెల్పిన ॥ నాంపల్లిపురవిహార ॥ (3)

శ్రీభాగవతుల కృష్ణ । సేవాధూరీణుడా । ఆగమనిగమములాదిగజూచియు । లోగలమర్మము బాగుగ దెలిశిన ॥ నాంపల్లిపురవిహార ॥ (౪)

శ్రీల్లానా శంకరేంద్రా । పరిపూర్ణాచంద్రా । హరహరి బ్రహ్మా సురాసుర తక్షక । వరులైనను మిము వశమె నుతింపగ ॥ నాంపల్లిపురవిహార ॥ (౫)

మరిగోలు కృష్ణదాసు మమతాతో మిమ్ములా । చూచి శేవబహుసుందరతరముగ । జేశితె జన్మము । ఆశబాశెనట । నాంపల్లిపురవిహారా నయగుణ ధీరా ॥ (౬)

ఈ, వహాబ్ అజీటన్ సా,

ఆరో రిజిమెంటు సేనాధిపతి కృతం.

సీ॥ అష్టాంగయోగంబులిష్టంబుగాసల్పి । కమలముఖాసన క్రమమొనర్చి । యక్షిద్వయము నాశికాగ్రంబునందుంచి । ఘట్టిగాపవనునిగట్టివైచి । పంచేంద్రియోన్మద భంజనం

బొనరించి। దేహూహామనునది దీశివేశి। పరవస్తువనుచిత్త
భవనంబులో నిల్పి। ముక్తి మృగాక్షిపై మోహముంచి॥
బ్రహ్మపదవైభవావలంబన వినోద। రతిసుఖానంద పరవశ
స్థితివహించి। వెలయుమిమ్ముల గనుగొంటి। వేడ్క మీర। పరిజనశరణ్య। శంకరగురువరేణ్యా॥ (3)

గీ॥ పరమ వేదాంత భూమికాంత రజలైక। సహిత
సాద్వైతచిన్మహానిధినివిగత। కజ్జలుండైయ్యగని మాకుగల
గజేశి। తరుదుగాదట శంకరాచార్యవర్యా॥ (౪)

మ॥ అలరన్ శంకర దేశికేంద్ర భవదీయాస్యేందు
బింబంబునన్। భళిరే వేద పటీం ద్రుమంబు బొడమెన్
పంచాక్షరీబీ। జలవ వ్యాజమునన్విరాజితమహా శాఖా
చయప్రాప్తమై। విలసత్పల్లవదీప్తమై మృదుపదోద్వర్తిం జ
గద్వ్యాప్తమై॥ (౫)

మ॥ కలుషధ్వాంత నికృంతనార్క శర సంఘాతంబు
మృత్యుగ్రహా। ద్రిల సజ్జంభవ పక్షిశుంభ దశ నిశ్రేష్టంబు
జన్మవ్రజా। జ్వలదంభోనిధి కుంభ సంభవ సహస్రంబున్
కృతాంతంబు భృ। త్కులజంఘాపవనంబు శంకర గురు
స్తోత్రంబు చిత్రంబిలన్॥ (౬)

రా. కీర్తన.

పున్నాగరాగం, ఆదితాళం.

పల్లవి.

గురువుకన్నా గొప్పదేదిరా। నాతండ్రి వినరా గురు వుకన్నా గొప్పదేదిరా॥

అనుపల్లవి.

గురువుకన్నా గొప్పదేది గుణరహిత పరమా తత్వా ధరుడవ్వా నీవాని పిలచి। దయతో పరిపూర్ణమును దె లిపే॥ గురువు కన్నా గొప్పదేదిరా॥

చరణములు.

ఎనుబయందూ పుట్టిగిట్టే నరులు। యా వానరులూ గిరులూ। సురలు హరికరి నికరములన్నియు సాటిగానివి లేనివె యనెటి॥ గురువుకన్నా॥ (౧)

సాధనాలన్నియు పెక్కు బాధయోగామూలని తెలశీ బోధ జేశెర। క్షణము నందే। పూర్ణ బ్రహ్మమూ జూ పించే॥ గురువుకన్నా॥ (౨)

ఇట్టి నిజగురు సాంప్రదాయము। బట్టి దీని గుట్టుదెలి యక। వట్టి కూతా లన్ని గూశే। వానరులా జేరకుమ నియే॥ గురువుకన్నా॥ (3)

శ్రీమద్భాగావతులా కృష్ణా। యోగీ శ్రీగురుసార్వభౌ

మూ । జేరి శేవించీ మించీయూ । శ్రీశంకారా మూ ర్తి
యైనా ॥ గురువుకన్నా ॥ (౪)

గంగిశెట్టీ వంశామందు ఘనుల పాదా ధూళి వీడే ।
నను చు లక్ష్మినారాయణా । దాసును కరుణ నేలీనా ।
గురువుకన్నా గొప్ప దేదిరా ॥ (౫)

చ॥ నలువబిలంబునం బ్రణవనాదముఘంటలతీరు మ్రోయగా । తలపున సాక్షి ము క్తి వనితామణిగాంచి కళాస్వ్రశంబులం । సలపగరంగి బిందు వటుజారగ పైరతిజేశి హాయిగా । వలపు నడంచి సౌఖ్యరసవారధి ముణగితి శంకరాగ్రణీ ॥ (౬)

మ॥ మాయం దాటివశించి యాసనమునన్ మైనిక్కి దృఙ్నిర్ధ్యమం । దాయాసంబునదృష్టినిల్పి ఘనసాహస్రారమందచర్చనో । పాయాళీన్నిము దల్చికుండలిని లేపన్ యీజగంబెల్లవె । ల్గాయం ఖేచరిగా నెరింగితి గదయ్యా శంకరగ్రామణీ ॥ (౭)

ఉ॥ శంకరుడే ధరాస్థలిని శంకర దేశికుడైజనించి నా । శంకలుదీర్చి తాపతతిశాంతి యొనర్చి పునర్భవాదిహృ । త్సంకటముల్ హరించి శ్రుతిసార సుమంత్ర రహస్యమంతయున్ । వేంకటస్వామిరెడ్డి యిటు వేగమె రమ్మని యాన తిచ్చిరా ॥ (౧౦)

కం॥ ధన్యుడ నైతిని మోక్షవ । దాన్యుడవీవైతి విట్టి దాతలుగలరే । మాన్యులలో మాన్యుడవీ । వన్య ద్విజుపీవె శంకరార్య వరేణ్యా ॥ (3)

మ॥ భవసక్తామరులం విముక్తభవమున్ బ్రార్థించగానిత్తురే। నవముక్తిం మహదీష్ట సంపదలుయానాక ద్రుమం బిచ్చుగా। కవనిం నింబమహీరుహం బొసగునే యాచించ మోక్షప్రదుం। డవునీవేగద శంకరార్య భవశుండాకౌఘ కంఠీరవా ॥ (౭)

మాదిరాజు సూర్యారావు గారి కృతం.

౯. కీర్తన. (భజ.)

హిందుస్తాని రాగం, ఆదితాళం.

పల్లవి.

గురురాజ్ సభాకర్వాకే ముఝెబుల్ వాయా, యెక్ పలక్మేదిల్ సంఝాయా ॥

అనుపల్లవి.

తబ్ నమస్కార్ కర్నేకూదిల్మే ఆయా । క్యాకహుం శిఫత్ గురురాయా ॥

చరణము.

ఎక్ • సపట్ ఝుపట్ మే । ఆశాకూతో డ్వాయా। జెబ్ చరనఖాక్, రసపాయా ॥ యేహైసో గుర్ూకీమాయా ।

సబ్ జహాన్ వృశీమే సమాయా ॥ సబ్ జహాన్ వృశీమేసమా యాహై ॥ ఎక్ పలక్మేదిల్ సంఝాయా ॥ గురు ॥ (౧)

అవుర్ సాధుసంతుసబ్ అమీరుఫకీరుఆయా । దర్ బార్ ఖానుకహెలాయా । జబ్ గురురాజు మహారాజునె కుఛ్ ఫర్మాయా । స్రాంఅమోల్ బోలీసబ్ జెఁసుఁఖుషు పాయా ॥ వే అజబ్ గారు కీజాయా । శ్రీకృష్ణ గురూకే సాయా, శ్రీకృష్ణగురూకేసాయాహై । ఏక్ పలక్మేదిల్ సం ఝాయా ॥ గురురాజ్ ॥ (౨)

మిల్ ఫీల్ ఖాన శంకర్ సే ఆబుతూభాయీ । నహీ సానిహైజెగుమేవుఁ కేకోయీ । అవుర్ కపట్ కుటిలనే యిస్కేఅంతునపాయీ । జెబ్ దశఁనుహ్వాతెహీ నా మరూపమిటుజాయీ । వహావ్వాజీ దేఖోభాయీ । హే సూర్యదాస్నేపాయీ । వేసూర్యదాస్నేపాయాహై । ఏక్ పలక్మేదిల్ సంఝాయా ॥ గురు ॥ (౩)

శ్రీశంకర దేశిక ప్రభూ మహారాజుకీ జై.

శా॥ క్షీణానాన్వయదుగ్ధవార్నిధిశశీ । పెంపొంద మద్దీప్తిరే । ఖలాదోచకరప్రభగ్లనక పంకధ్వాంతముంబాపె నా । బల్ ఖేదంబులడంచె పాదరజమే భావింప నన్యంబు చాల్ । చాల్ ఖాడేందు సద్భజ్ఞభంబులెమదిఁ సంధిం తు శ్రీశంకర్హా ॥ (౧)

శా॥ శ్రీనాథుండు నిజప్రభావమెరుకం జేయంగ దా వచ్చి ఫీ। ల్ఖానాశంకరరావు రూపుడయి। రంగత్తూష్ణగుర్వాస్సుజ। శ్రీవాక్యంబెఱిగించె దద్గురుకృపా శ్రీచేతసుజ్ఞానముల్ బూనెన్ వేంకట రామదాస వరుడో ప్పూర్ మూలమల్లాఖ్యుడై. (౭)

మధుర కవిదాస్ పురవు జోజఫ్ వెంగు
అజీటన్ సా (౫) దవపల్టన్ అనగా
రిజిమెంట్ పైదల్ సేనాధిపతి సమస్తాన్
వనపర్తి - కృతం పంచరత్న సీసపద్యములు.

సీ॥ శ్రీరమాపతి పాద సేవాసమాసక్త చిత్తుడై విబుధ సం సేవ్యుడగుచు। శమదమాదులు నిత్యమమలబుద్ధిని జేసి ప్రస్పందనాదులసడలవిడచి। యమనియమాసనా ద్యష్టాంగ యోగముల్ నిరతంబు మనమున నిగుడజేసి। సాంఖ్య తారకయోగశాస్త్రముల్ దెలకించి తత్వసంసిద్ధిచే ధన్యుడగుచు। నలరు శ్రీఫీలుఖానాఖ్య కలితవంశ జలధి పూర్ణిమ చంద్రుస్సంస్తవమొనప। వశమెయందరు కవివరుల్ విశదఫణితి। రమ్యగుణ తంత్రి శంకర రాయమంత్రి॥ (౮)

సీ॥ బాదరాయణుని డెంచ వేదంబులకు నెల్ల చతురాననుడై సర్వ శాస్త్రములకు। వాక్యార్థ మొనరింప వరగౌతమాఖ్యుడౌ పారమార్థిక బోధ నారదుండే। వరకృపాగు

ణమున గరుడ తురంగుడే నీతిచే సుర గురుఖ్యాతిపరుడె।
సత్యసంగతి హరిశ్చంద్ర క్షితీశుడే సత్కాంతి గుణమున
భాస్కరుండె। యనుచు బుధవర్యుల హరహా మాత్మగుణ
ము। లభినుతింపగ వెలశితివవనిలోన। శరధిగాంభీర్యగాంగే
యశైలధైర్య। రమ్యగుణ ధుర్య శంకరరాయవర్య॥ (౫)

సీ॥ శుద్ధసత్వ నిరూఢి శోభిల్లెనే ధీరు డురుతర హరి
భక్తిపరత దనరి। కృపారారి షడ్వర్గ వారాసినే పుణ్యు
డమల విజ్ఞానోపమునను దాటె। నఖిలాగమములెల్లనిర్ణ
యింపగజాలెనే ధన్యుడస్తోక మేధకలన। చక్రిసద్గుణకథా
శ్రవణంబున నెకాల మే। మేటి యనుదిన మెనయబుచ్చె।
నట్టిసద్గజ శాలాధికార విభవు। పైనయామేటినెన్నమాక
రుదెయండ్రు। శరధిగాంభీర్య గాంగేయ శైల ధైర్యరమ్య
గుణధుర్యశంకరరాయ వర్యా॥ (౬)

సీ॥ తనలసద్విద్యమహి తనకీర్తిచందాన సర్వజ్ఞమౌళిభూ
షణముగాగ। తనవిస్ఫురన్నీతి తనకీర్తిచందానవిబుధలోకా
క్రాంతి విస్తరిల్ల। తనవచోనిచయంబు తనకీర్తి చందానకల
శాబ్ధిస్ఫూర్తివై ఖరిని దెగడ। తనధైర్యగరిమంబు తనకీర్తి
చందాన కైలాస హిమశైల గరిమ లణప। వెలశె నీతనిస
ద్గుణకలనమెంచ। దరమె మాకనికవివరుల్ నిరతమండ్రు।
శరధిగాంభీర్య గాంగేయశైల ధైర్య। రమ్యగుణ ధుర్య శం

కర రాయవర్యా ॥ (౭)

సీ॥ వసుధీవరుడర్ధి భూసురామరశాఖి యనదగి జగతి
పై ఘనతకెక్కె । యేయార్య పరివృఢుండా యతమార్గ
ణ జనసౌలభేయిమైమె చెలువుగాంచె । యేసుధృక్ప్రవరుం
డు భాసమాన మహీశ సభలలో బహుమతుల్ విభవ
మొందె । యే మహాద్గుణ పూర్ణుడె సమాన సుజ్ఞాన
పూర్తిచే పరహితబుద్ధిగనియె ॥ అట్టి శ్రీఫీలుఖానాభి దా
న్వయమున । బుట్టి నరశింహ్మరాయ సత్పుత్రుడనగ । వెల
యు మిమ్మెంచదరమే యావేధకైన । రమ్యగుణ సాంద్ర
శంకర రాయ చంద్రా ॥ (౮)

సీ॥ వరచిత్రభాను సంవత్సరంబున పుష్యశుక్ల పంచమి
తిధి శుభాగమతిని । రచియించె పంచ సద్రత్న సీసంబులు
వరపీలుఖాన సద్వంశుడైన। శంకరాచార్యుల కంకితంబుగ
వచశ్ప్రౌఢీనభ్యుదయుభివృద్ధిగనగ । సద్యేవసంతాన సంతతి
ప్రవరుడౌ మధురసత్కవి జగన్మండలమున । తనదువైదుషి
కవివరుల్ వినుతిశేయ । మహిత శ్రీపతిపాదాబ్జ హితచి
త్త । వృత్తి సంతతమలవడ మత్తులైరి ॥ మిత్తి యనమించు
యంగభూమీశ సుతుడూ ॥ (౯)

## ౧౦. కీర్తన. (యోగం.)

రాగం - శుద్ధసావేరి, ఆదితాళం.

### పల్లవి.

జాజిరి, జాజిరి, జాజిరి, జాజిరి, జాజిరి, జాజిరి, జాజిరి, జాజిరి ॥

### అనుపల్లవి.

తొమ్మిది భాటలు గలిగిన మ్యేడా । మ్యేడ మీద ఘనగుండ్లను జూడా । పెద్దలందరును గుంపుగూడా । చిలుకలైదు బహునాట్యములాడా ॥ జాజిరి ॥

నిజగురునాధుని నిల్కడజూడా । నిల్కడ దేలశితే నిర్మలమాడా । ఆజహరహరులకు అందనిజాడా । యిదేసంసారము దాటే వాడా ॥ జాజిరి ॥ (౧)

గురువు శిష్యులకు గుర్తొకమేటి । గుణముగుదిరినంతట నేసూటి । చూడుముగురిగలిగితే బహుపాటీ । గుణహీనుల గుర్తదియాపాటి ॥ జాజిరి ॥ (౨)

ముక్కుతుదది బహుసూటిర భాటా । ముగ్గురు మూర్తులు మునిగినప్యాటా । మూడుమూలములు గలశినచోటా । మూర్ఖవైరులనుచుండే మాటా ॥ జాజిరి ॥ (3)

మోదమలర గురుగోప్యమెతేటా । మోటురండ కొడుకుల కదిర్ఝూటా । వాద భేదములు వదరకు నోటా । వదలక

పాతివే వోంచ్చెర స్టోటా ॥ జాజిరి ॥ (౪)

ఎన్నిజన్మములు యెత్తితిమన్నా । యెత్తిజేశినది యేమనుకున్నా । పరిపూర్ణముతాగనుగోనకున్నా । యొటుకమూలమును వెతికిన సున్నా ॥ జాజిరి ॥ (౫)

ఎన్ని దేశములకేగితే నేమీ । యెన్నిజన్మములుయెత్తితే నేమీ । యెందరుపెద్దలజూచితె నేమీ । యెన్ని జెప్పినా విననివానికి యేంతో అంతే యెక్కువరాదూ ॥జాజిరి॥ (౬)

ఎన్ని ధర్మములు జేశితె నేమీ । యెన్నితీర్థముల మునిగితె నేమీ । యెన్ని యాత్రలని తిరిగితె నేమీ । యేకబ్రహ్మము నెఱుగక పోతే । యెందుకు వారిని యేటిలో దాచా ॥ జాజిరి ॥ (౭)

వింతవింతలవి వినువు మటన్నా । వీనులవిని విననట్టుగయున్నా । విహితవాక్యములు చెవి జొరకున్నా । వీడెబల్లకు మొగడోరన్నా ॥ జాజిరి ॥ (౮)

భాగవతులశ్రీకృష్ణుని శేవా । బాగుగజేశిన భక్తులతోవా । భళిభళి నాతొలి భవమిడిపోవా । భక్తితో జేశితి శంకరు శేవా ॥ జాజిరి ॥ (౯)

సీతారామయ్యనునా పేరూ । గుణవంతులకందరికి జోహారూ । శ్రీగురుపాదములే కనగోరూ । శ్రీశంకరు దర్శనమేకోరూ ॥ జాజిరి ॥ (౧౦)

వేంకట నరసింహారావు దేశముఖుగారి కృతం.

పరమామ్నాయశిఖారహస్యవిదులై పంచాక్షరీమంత్రత। త్పరులై యోగ విచారఘట్టకరులై బ్రహ్మైక్య భావస్ఫురా। త్పరులై ముక్తివధూకరగ్రహణులై తద్భ్యాంబు రాజిల్లుశం। కర రావ్ దేశిక పాద పద్మములకుం కైంకర్యనిష్ఠాగతిన్ ॥ (౧)

కృష్ణమాచారి కృతం.

శ్లో॥ నానాపాప విమోచనంబు కొరకై। నాచేత నర్పించు యీ। పౌనఃపుణ్య సమః స్సహస్రదళముల్ భక్తిన్ స్ఫురత్కేసరభం। బానందాశ్వ మరందమున్ గలుగు దివ్యామోద విజ్ఞాపనా। నూనాంభోజము సఖ్యమొందుటకు నేనుహింతు నెల్లప్పుడున్ ॥ (౨)

కేశవాచారి కృతం.

మ॥ వరవృషవత్సరాన్విత నభంబున కృష్ణదళంబునన్। ఖరాఖరగచతుర్ధశీదినమునం బహుబంధు జనంబులతో భవ। త్పరమకృపాకటాక్షమున భక్తవరేణ్యుడనైన నేను సుస్థిరముగ నున్నవాడ భవదీయ్య శుభంబులు వ్రాశి పంపుడీ ॥ (౩)

కృష్ణస్వామినాయుడు సుబేదారు మేజరు

యిలాకే అంగ్రేజీ.

ఉ॥ కమలజగేహిం నీచరణ కంజరణన్మణి నూపురాభటుల్ । సమ మృదువాక్య జృంభణ రస స్ఫురణామృత ధారలెల్ల సం । భ్రమమున మీరుజల్లుమదభాగ్య పటాయుత కర్ణయుగ్మముం । దమరగ బిందువాక్కుటియు నైన లభించక పోయెనక్కటా ॥ (౧)

గీ॥ ముక్తిదములైన మీపాదములను గాంచు । భాగ్యమెన్నుండు గలుగునో భానుతేజ । భవహరంబైన మీసేవ భక్తిమీర । సలుపుటెన్నడు గలుగునో కలుష దూరా॥ (౩)

కం॥ నాటికికృతార్థుడనునా । నాటికి దురితాప హారుడనాటికిఘనుడ । న్నాటికి భవరాహిత్యుడ । నాటికినే ముక్తుడగుదు నాటినభక్తి ॥ (౪)

శ్రీనిజగురు మహారాజుకీజై.

రాళ్లభండి నృశింహశాస్త్రికృతం.

౧౧. కీర్తన. (నీతివివరం.)

రాగం - ఆనందభైరవి, ఆదితాళం.

పల్లవి.

శ్రీనిజగురు శిద్ధాంతవాక్యములు చిత్తగింపవే । సామనసా। పూనికర్మగురు సముదాయములను । పొందకుండవే । ప్రేమనసా॥ (౧)

అ ను ప ల్ల వి.

కర్మగురువుల నయెవరని యన్ననుమర్మము దెల్పదవిను మనసా । ధర్మాధర్మము దెలియకతమదే । ధర్మమందురే న్రామనసా ॥ శ్రీనిజ ॥ (౨)

చ ర ణ ము లు.

దానధర్మములుజేశితే జన్మమురా । గలదందురే । న్రా మనసా । ప్రాణిముల్లెలందరి వెగవేశితే । పుట్టకుందురట వినుమనసా ॥ శ్రీనిజ ॥ (౩)

పరులదూషణలు బాగుగచేయుచు । భక్తులమందురు తమమనసా । మఱియుచు ముందరజన్మములేదని । నరకము జెందుదురో మనసా ॥ శ్రీనిజ ॥ (౪)

బంధమోక్షములు జెందమమేమని ।. భక్తివిడుతురేతమ మనసా । గురువం దున్నైల్యములు । కొన్నిగలవుయని గొణుగుచుందురే వినుమనసా ॥ శ్రీనిజ ॥ (౫)

పాపపుణ్యములు మాకికయేడివి । పరమగురువు కని తమమనసా । తేపతేపకును మనసుని । ర్ణయముతెచ్చుకుందురే న్రామనసా ॥ శ్రీనిజ ॥ (౬)

తత్వమసీ నాలుగువాక్యంబులుతా । మదెలుసుకొని । వ్రామనసా । యేత్వపీత్వములు జేశితెపూర్ణులకేది । భేదముని తమమనసా ॥ శ్రీనిజ ॥ (౭)

చలనములేక యచలమును గనితన, చలనముడుగకనే। న్నోమనసా। యిలలో మేమేయనుభవవేద్యుల, మనిమె గురుదురే। న్నోమనసా ॥ శ్రీనిజ ॥ (౮)

ద్వాదశషోడశ వాక్యముల్ విధికృత, మరయకథన్యుల మనిమనసా। తత్వాతీత గ్రంథముగైకొని, దాటితిజన్మం బనిమనసా ॥ శ్రీనిజ ॥ (౯)

యెన్నిజెప్పుదును యెన్ని వ్రాతునిక, యెరిగి కనగదే నా మనసా। యిన్నిగుణంబులు కన్నమిక్కిలిక। యె న్నజాలనె న్నోమనసా ॥ శ్రీనిజ ॥ (౧౦)

శ్రీమద్భాగవతా కృష్ణాఖ్య స్వామిని జూడవే నామ నసా। పాదములందున భక్తినిలిపి భవబంధములోదులవె నామనసా ॥ శ్రీనిజ ॥ (౧౧)

ఫీలుఖానశ్రీశంకరదేశిక ప్రభువును జేరవే నా మన సా। కీలు దెలశి నీమూల మెరిగి గురుపాల బడగదే నా మనసా ॥ శ్రీనిజ ॥ (౧౨)

రాళ్లభండి నరసింహ్మదాసునకు రాజమార్గమిదివిను మనసా। రాగ రోగ భయరట్టడి గుణముకు రాజ వైద్య మిదె కను మనసా ॥ శ్రీనిజగురు శిద్ధాంత వాక్యము చిత్త గింపవే నామనసా ॥ (౧౩)

శ్రీసద్గురు మహా రాజుకీజై.

పాములపాటి కృష్ణస్వామిగారు చేశిన కృతం.

ఉ॥ ధారుణి గోలకొండ పుర ధన్యుడు శంకర రాయవ ర్యుడిం। పారగ కీర్తిగాంచె నిహపారద నాదర శారదాబ్జ ముల్। హీరపటీరశంకరమహీధర వెంకటరామదాసు శే। వారశికత్వధీరతతొ వాశికినెక్కెసమస్తదిక్కులన్॥ (౧ )

ఉ॥ సరసుడు రామిరెడ్డి భువి సన్నుతి జేశెను శంక రార్యులన్। వరుసతొ ధ్యాన రీతిగను వొప్పుగ శంకరు దీటు బోల్చియుం। బరువడి ప్రార్థనంబు బహు భంగుల పద్యముఖంబు రీతిగా। మరువక దీనభావమున మానస మందున హాన్రి శాదులన్ ॥ (౧౩)

ఈ, వహాబ్ దొరగారు చెప్పిన పద్యములు.

సీ॥ ఉర్విలోపలమేలు వృత్తముద్దైనట్టి ఘ్ఞాన శంకర ప్రియగురుండు। ఙ్ఞానోపదేశంబు ఘనుడని మూల్లళ్ల। వేంకటరాందాస్కు వేడుకలర। యిచ్చెనగ్గైకొని యిహ పరమందున, యింపుగాకీర్తనయు సొంపుమీర। భక్తితో తనయుక్తి శక్త్యానుసారంబు భుక్తిముక్తుల కనుగ కీదనర। ధరణిగాంచియుతవపద ధ్యానినిరత। శేవయొనరించి నిశ్చ లసిద్ధిగాంచి। ఖ్యాతివిలసిల్ల భువిని విఖ్యాతిజెందె। శంక రార్యుల ప్రియశిష్య శేఖరుండు ॥ (౧౦)

సీ॥ శ్రీకృష్ణు కృప గల్గు శంకర రాయుండు మూల్లళ్ల

రాందాసు ముఖ్యశిష్య। రహస్యనిబిలచి రహస్య వచనంబులు
పరులెవర్వినకుండపలికెనపుడు । గురువుదైవంబుల గురు
తుగా శేవించి ముందునాశీర్వాద మొందుమనుచు । పలి
కిఫ గనుకొని పాదంబులకు మ్రొక్క సకల సాంబ్రాజ్య సం
సారపదవి । గల్గునీకని వరమిచ్చి కౌగలించి । కరుణ మ
దినెంచి మముగాంచి కానిమంచి। వరము శంకరుగోరుము
వరుసతోడ ।ననుచు వేంకట రాంరెడ్డి కానతిచ్చె ॥ (౧౧)

శ్లో॥ శ్రీమచ్ఛంకర తీర్థానాం। విజ్ఞాపయితి సన్నిధిం।
వేంకట్రామదాసాఖ్యాతో భక్తవరశిష్యమార్గ ॥ (౬)

శ్లో॥ వేదాంతమార్గనిరతోః బ్రహ్మైక్యజ్ఞాన తత్పరాః॥
భవద్భ్యశ్శంకరా చార్యాః। భూయో భూయో నమో
నమః ॥ (౭)

శ్లో॥ ఫీఖానానివాసేనా । భవతాంభాగ్యసాక్షితం ।
భాతిత ప్రసనుకర్కేణ । న్యోమేదవిమలాత్మనా॥ (౮)

శ్లో॥ పరిపూర్ణమనోరథావయం । భవతామచ్యక్ర
పావలోకనాత్ । భవదీయ్య శుభంప్రతీక్షమాణాః । స్న
హాపుత్రైస్సుఖబంధుభృత్యవర్గైః॥ (౯)

శ్లో॥ యూయంప్రేషయతక్షిప్రం। భవత్కుశల పత్రి
కాం । ప్రతీక్షామ్యామ యం సర్వే । చకోరాశ్చంద్రికా
మివా । (౧౦)

సీసార్ధపంచరత్నములు, యేడ్వేటువహాబ్,కృతం.

సీ॥ శ్రీమత్కవీశ్వర శ్రేష్ఠులనొనియాడి! శేవించిమొ క్కేద శిరమువంచి । పంచరత్నములనే పద్యముల్ సీసార్ధ పరముగాజేసితి పఠనజేయు । వలయుతప్పులు చాలవచియించినాడని । వంచానజేయకుంచుడీ । సభశోభితులార । మంచివాటీగజేయుడీ । ఛంద్దాస్సుమొదలౌకావ్య । లిందుకేచదువాలేదు । సందేహమేరాదుమీా। యందారికీదయయుంటే । వంచానచేయకుంచుడీ, । సభశోభితులారా, మంచివాటీగాజేయుడీ॥ (౧౨)

సీ॥ మూాలమళ్లాన్వయ ముఖ్య వెంకటరామదాసరారమ్మని తక్షణమున । గాంచిపుస్తకముపై ఘనహస్తమును జేర్చి, త్రివిధదీక్షలొసంగి దివ్యమైన । పదిరెండుపదహారు పరమార్ధవాక్యముల్ । మంత్రాయూగామ్మూదెల్పిరి । సంసారభ్రాంతి । తంత్రామూాలెల్లాదుల్పిరీ । మధురాకవిదాసహృదయ, మందూా నివశించియొండే । బుధనూతశంకరాఖ్య । సదయాదేశికవరులు । మంత్రాయూగామూాదెల్పిరి । సంసారభ్రాంతి । తంత్రాముల్లెల్లాదుల్పిరీ॥ (౧౩)

సీ॥ శ్రీశంకరస్వామి శృంగారమొలుకంగ చేశెకాందరికుపదేశ బోధ । ఆబోధ మెట్లన్నఅహామె బ్రహ్మాంబనే, అదిసహించగలేక దానిపైది । కోరితిగాని కోకేా

దీరకపాయ। మీచేరహితంబైపాయనూ। తిరిగిరానేరా, దోచాకలేకాపాయనూ। ఆశంకరావాతారమలీ శంకరూలసమమూ, నా। శంకాలన్నిదీశి, వశీత్రెకాభళి భాళి! మీచేరహితంబై పాయనూ। తిరిగిరానేరా,దోచాకలేకా పాయనూ॥ (౧౪)

సీ॥ మీపాదశేవచే మేలైనయిబోధ గల్గెగా యే మందు కరుణశాలి। మీపాదతీర్థంబు మాకుదొరికినయంత భవనాశమును బొంది భ్రాంతిపోలగ। యెరుకయను మాయతానెరిగి పాయనునాకె। దానితో లేచిపోయనూ। సకలప్రపంచ మేమిలేకుండా బాయనూ। యీరీతిపోయిన,మీదె మీఘనముండనోడాం। స్త్రీరీతిదాని పల్కాయేరీ యెవరున్నారికనూ। దానితో లేచి పాయనూ। సకల ప్రపంచామేమి లేకుండాబోయనూ॥ (౧౫)

సీ॥ శ్రీమద్గురుశ్రేష్ట శ్రీశంకరాచార్య శ్రీకృష్ణశేవక శ్రీరమేశ। నాంపల్లియను గ్రామమందు నివశించియు నియమైన భక్తులనరయుచుండు। నాకామిమ్ముగొనియాడ వేరెవ్వరైనను। యింద్రాదిసురలాకైనాను। వశమూగాకుండూ। వేంద్రాదివరులకైననూ। ఫీల్ ఖానవంశమెల్లా। పావానమొందాజేయా। బూనియందవ తరించిన। దేవూడా దీవెశావ। యింద్రాదిసుగలకైనానూ। వశముగాకుండు పేంద్రాదివరులకైనాను॥ (౧౬)

౧౨. కీర్తన.

నాటకురంజిరాగం - జంపె తాళం.

పల్లవి.

వచియించిరె చెలియా - అచలం ॥

అనుపల్లవి.

హెచ్చయినా ముత్యాలు గూర్చిన । పచ్చలతీరునా ।
స్వచ్ఛమైనా బోధాదెల్పెయాచార్యులేవీరునా ॥ వచి ॥
ప్రకృతీస్వయదోష రహితభావనీయ్యులే । సుకృతము
పనిషద్భాష్యాబోధన సూత్రధారులె ॥ వచి ॥ (౧)
ఎఱుకలేక మరుపుగాక యేకమైనారు।పరిపూర్ణ హృ
దయాభక్తశిష్యా భావనీయ్యులే ॥ వచి ॥ (౨)
రూఢిగాను ద్వాదశాక్షరి తోడుజేశిరి । యాడజూ
డ షోడశాక్షరి జాడమాన్పిరీ ॥ వచి ॥ (3)
మాదిరాజు సూర్యరావు హృదయ మందిరంబున । బో
ధానందాతీత్వా అర్చనాది పూజ్యులే ॥ వచి ॥ (౪)
మాధవరాజు వెంకటప్పారావు మండలేశ్వరులే । శ్రీ
రాధారుక్మిణీసహిత । రాధానియ్యులే ॥ వచి ॥ (౫)
రంగైనాగారామపల్లె । వరలింగయాఖ్యులే । అంతరం
గ మందె వెలశిన గురులింగమూర్తినీ ॥ వచి ॥ (౬)
పాలు, శ్రీహైదాబాద్ । నగరమందునా । ఫీలుఖా

సా శంకరదేశిక । ప్రభువులై వెలశిరీ ॥ వచియించిరె చె
లియా॥ అచలం ॥ (౭)

## ౧౩. కీర్తన. (రామరాజుకృతం.)

శంకరాభరణరాగం - ఆదితాళం.

### పల్లవి.

దాసానదాసులకు దాసుడనయ్య గురుడా ॥

### అనుపల్లవి.

ఆశా, పాశ మోహాదుల నెల్లనిల । బాసీమోక్షాపేక్ష,
కోసామైయ్యుండేవారి ॥ దాసాన ॥ (౧)

### చరణములు.

ఈషణత్రయములు దోషామనుచుభువిని । కాషా
య వస్త్రములుగట్టినిర్ణి స్మరియించె ॥ దాసాన ॥ (౨)

దశేంద్రియములకు । వశూలుగాకనీకోసామే । ఏకద్రి
ష్టిజేసేటి వారిదాస ॥ దాసానదాసులకు ॥ (౩)

అష్టాంగ యోగమూల నభ్యాశించియు పరమ । నిష్టా
సలిపినట్టి శిష్టూలదాసదాస ॥ దాసాన ॥ (౪)

ఆరూమతంబుల కారూబారులు, మీారికోరిక లేని విచా
రులైన వారిదాసాన ॥ దాసాన ॥ (౫)

కాయాశ్రిద్ధులుజేశి కలమాయతోనుగాక । గుహాలా
యందూ కూచుండి। మిమ్ముస్మరియించె॥దాసాన॥ (౬)

పంచేంద్రియంబుల పాలీటబడకను । మంచిగుణాన్భవమనె । హరిభజనజేసే । దాసాన దాసూల దాసుడనయ్యనీ ॥ దాసాన ॥ (౭)

వాసీగఫీలుఖాన వంశాధిపతి । చెంద్రశేఖారూని । నిత్యశేవించెవారి । దాసాన దాసూలకు దాసుడనయ్యను ॥ దాసాన ॥ (౮)

వాసీగగరుడపురి వాసూడయ్య రామదాసూని బ్రోచిన దైవశిఖామణి । దాసాన దాసూలకు వాసూడనయ్యనీదాసా ॥ దాసాన ॥ (౯)

౧౪ - కీర్తన.

మారువరాగం - ఆదితాళం.

పల్లవి.

పరమేశయనరో । మూఢచిత్త పరమేశయనరా ॥

అనుపల్లవి.

పరమేశయని నీవుపలుమారు బలికితే । చిరకాలమును బ్రోచె బిరుదుగల దటరా ॥ పరమేశ ॥

కరినేలెనటరా, మూఢచిత్తమ । కరినిద్రుంచెనురా । దనుజరావణూని । అనుజవిభీషణుని । మనవిగైకొని । లంకకును రాజుచేశిన ॥ పరమేశ ॥ (౧)

అతిదారిద్ర్యముచే । ద్విజుడొచ్చి తన స్తితివినపరచే ।

మితిలేని అయిశ్వర్య మతిశయముగనొసగి, క్షితిలోదా
సులపై,అతిప్రేమగలిగిన॥పరమేశయనరా॥మూఢచిత్త॥ (౧)

వాలినిద్రుంచి, కిష్కింధ సుగ్రీవునేలించి। పారావార
ముపైని। వారాధిబంధించి। బోరూడౌదశకందరు, మో
రికదీర్చిన। పరమేశయనరా॥మూఢచిత్త॥ (౨)

నిగమాగోచరుడూ। కృష్ణదేశిక। యోగిప్రియవ్రతు
డూ। రాగద్వేషమూల। త్యాగాము జేయించే। యోగి
శంకరదేశికేంద్రూని మదినమ్మి। పరమేశయనరా॥ మూ
ఢచిత్త॥ (3)

శ్రీశంకరదేశిక ప్రభువులవారు, రాజాపేట
కుదౌరాకు పోయినందున, అనగాసప్తా
హ రుణ విముక్తిసంచారం వెళ్లినప్పుడు,
రాజాపేట వారు చెప్పిన॥

౧౫. కీర్తన.

రేగుప్తిరాగం - ఆదితాళం.

పల్లవి.

శంకరదేశికులొచ్చిరమ్మా శ్రీఫీలుఖానా శంకర॥

అనుపల్లవి.

సంకల్పాము లెరింగి సద్భక్తులాకునిష్క। శంకముగా
బోధపాంకముగా జేయూచూ॥ శంకర॥

చ ర ణ ము లు.

ఖరనామ సంవత్సరమునందూ । యీభాద్రపద, వర
శుద్ధదశమి శుభదినమందూ । సరగూనరాజపేట, కరుగూ
దెంచినయంత । పురజనూలూనుమోద । భరితులై శేవజే
య ॥ శంకర ॥ (౧)

భేరిమృదంగతాళములూ, సానాయివంక । ధారాత
మ్మాళ బాజాతోను । పేరుకెక్కీనజమూ । నారూడుబా
లారాము। కోరికతోడనె దూరుకొని వెంబాడిరాగా॥(౨)

పువ్వూలుమేనగుప్పచూనూ । పుణ్యాంగనాలు । న
వ్వూలందాము మించగానూ । జవ్వాజికుంకుమాది । చం
దానములుబూని । నివ్వాళులివ్వగానూ । నిండూసంతో
షమూన । శంకర ॥ (౩)

మతిమంతూలెన్నాగాను సుజ్ఞాన । వరుడైనభాగవత
కృష్ణ దేశికులాభజాన । సతతామూసేయూచును । కు
తలామందూనభక్త, హితపూజలంగాడిగాను । అతులీత
మున వెలుంగు ॥ శంకర ॥ (౪)

అందాముగాను జనుదెంచి । శివదేవాళంబునందూ ప్ర
వేశామొనరించి । పొందూగహరిహరగురు । పుణ్యాచా
రిత్రప్రతి । దినమందూ భజనజేయుచుండూ రెల్లప్పుడ
న్గ, శంక ॥ (౫)

జ్ఞానోపదేశమూనుజేశి । కడతేర్చుమార్గ మూనుదె
ల్పుచు దగ్గెరదీసి । మానావులకు మూఖ్ఞ మానాస
మూలు బాపి, । సానూరాగమున మోక్షసార మెరుంగ
జేసే ॥ శంకర ॥ (౬)

సందేహాములనెల్లద్రుంచి । భక్తులోసంగువం । దనము
లును గ్రహించి । డెందాములోన పరమా । నందమును
వాసించి । ముందారిమార్గముల । చందాముతా దేల్పు
చు ॥ శంకరదేశికులొచ్చిరమ్మా శ్రీఫీలుఖానా ॥ (౭)

శ్రీశంకర దేశిక ప్రభూ మహారాజుకీ జై.

## ౧౬. కీర్తనలు.

ముఖారిరాగం - అటతాళం.

### పల్లవి.

శంకరప్రభుశేవజేతామా । శ్రీఫీలుఖానా ॥ శంకర ॥

### అనుపల్లవి.

ఇంకయేమని చెప్పుదునుయెటు । వంకజూచినభక్తులే
కడు । పొంకమున గుమిగూడియునుపర । పంకజంబులువి
డువజాలరు ॥ శంకర ॥

### చరణములు.

నిక్కముగమదిలోన గోరియు । సన్మార్గమూన । చక్క
గను । సన్నిధినిజేరియు । యెక్కడెవ్వరుగారుమీరే । ది

క్కటంచని భక్తితోడుత। ప్రొక్కి వేడిన భక్తవరులకు। మోక్షమిచ్చితరింప జేసిన ॥ శంకర ॥ (౧)

కోరికనుమదిలోన దెచ్చియూ। వేగమున। నంగూనూరి వెంకయ్యాను మెచ్చియూ। సారెసారెకు తత్వబోధర। సానుభవమును జెందెగావున। తారకోక్తులు నుగ్గడింపుచు। నేరుపునవిలసిల్లుచుండును ॥ శంకర ॥ (౨)

ఉల్లమునమీాభక్తిమరువానూ। కడతేర్చుమని। పులిగిళ్లసోమయవచ్చి వేడానూ। కొల్లలుగసిరి గలిగియును। వర్ధిల్లుమనిదీ వెనలొసంగుచు। తెల్లముగనివసించినాడట। తేజమంతట నివ్వటిల్లగ ॥ శంకరప్రభు ॥ (3)

నిండుకోరికపండు పండానూ। పుల్లూరువంశమండనుడు బుచ్చెయ్యదండాను। అండబాయకనిల్చిమీాపద। పుండరీకములకును ప్రొక్కెద। యిందునాశీర్వచనమనికో। రుండగా దీవింపుచుండును ॥ శంకరప్రభు ॥ (౪)

ఆయురారోగ్యాభివృద్ధియూ। పెద్దాల భక్తియందు మోదామందు బుద్ధియు। పాయకనుధనధాన్య పుత్రపౌత్రలాభముగల్గునంచని। జేయునాశీర్వాద మెప్పుడు చిత్తమున సంతోషమడరగ ॥ శంకర ॥ (౫)

దేశదేశములందు వెలశియూ। భాగవతకృష్ణ। దేశికులనామంబు దలచియూ ॥ కాశిగయరామేశ్వరంబులు।

వాశిరావని యెంచిజూచియు । పాశబంధములన్నిగోసి ॥
భాసురంబుగ వెలుగుచుండే ॥ శంకరప్రభు శేవజేతామా
శ్రీశీలుఖానా శంకరప్రభు శేవచేతామా ॥ (౭)

౧౭ కీర్తన.

రాగంశ్యాహాన - ఆదితాళం.

పల్లవి.

తెలియారాజీవయీ । తెలివేదేహాములాని

అనుపల్లవి.

ఇలనూ వంధ్యాసూనువలెనూ । భూవలయామాని ।
తెలివిచే బయలుండా దెలిశేయీ తెలిపీని । తెలిపీచేతానే
పట్టిత్రిశివేయ్యారపోసీ ॥ తెలియరా ॥

చరణములు.

కలల్లోనా గన్నాయా యర్ధముల్ నిజామానే। వెలశీనత్రి
భువనంబుల । కలగాను మదిలోయెంచి ॥ తెలియారా(౧)
ఎరుకామరుపూలా దెలిశే । మొరకానే । నేనాని ।
మొరిగుండూ మెదిరిసై। గురువాజ్ఞగలదాని॥ తెలియాగా(౨)
పాంకాముతోశీల్లాన । శంకారేంద్రునిపాద । పంకా
జామూలునమ్మి । శంకాబాయూమువేగ॥ తెలియారా(3)

౧౮ కీర్తన - రాగం,

సౌరాష్ట్రరాగం - ఆదితాళం

పల్లవి.

ఎన్నటికోకద నీలోజేరుట । జగదీశ్వరహరహర ॥ఎన్న
టికోక దనీలోజేరుటా ॥

అనుపల్లవి.

ఏలగలిగె నాలుగుదేహంబులు । యెవరూ జెప్ప
రూ । కీలుదెలియకను కాలునిపాశము । లోనబడిరి జను
లందరూ । యేలసుఖించక యేలదుఃఖమిక । కీలుదెలిపె
గురుపాలబడకచెడి ॥ యెన్నటి ॥

చరణములు.

భోగభాగ్యములె తుచ్ఛసుఖములివి । వినరూ - అవి
గనరూ । భాగవతులశ్రీ కృష్ణనిజగురుని । పదములుగో
రక కొందరూ । యోగంబుల బహుయోగంబులబడి ।
త్యాగమెన్ని జన్మముల గనకచెడి ॥ యెన్నటికోకద ॥ (౧)

యేలగలిగె దేహములకవస్థలు । యవరూ । వివరించ
రూ । నాలుగు అభిమానంబుల విడకను । గోలుపోయిరి
నరులందరూ । యేలచింతలిక యేవిచారము । ఫీలుఖాన
శంకరుజేరకచెడి ॥ యెన్నటికోకద ॥ (౨)

ఉ॥ శ్రీమతిమీపదంబుల, స్మరించిన వేంకటరామ రె
డ్డిగా । రీమహి మీకృపామహిమవృద్ధి బరంగినరీతిభూ
జనుల్ । మీమృదుపాదభక్తి దగమించుటలున్వినిహర్షినై

తిము౯ । వేమరునాత్మజూతుఁను వివేకత శంకరరాయధీ
మణీ ॥ (౩)

ఉ॥ వేంకటరెడ్డిగారికిని వేడుకమీాకరుణా కటాక్ష
ముల్ । పొంకముగా బ్రసన్నగతి భూషణశేయ నతంచు
తత్త్వవి । జ్ఞాంకుర చిత్తుండై ప్రబలుడౌ నిహమందు పరం
బునందుమీా । శంకరలీలలం బొగడశక్యమే శంకరరాయ
చిక్షనీ ॥ (౪)

క॥ మీావదనచంద్ర దర్శనమేవేళను నాదుమానసేం
దీవర । మెంతో వాంఛ జేయుచుండును । కోవిదశంకరబు
ధేంద్ర గుణరత్ననిధీ ॥ (౫)

## ౧౯. కీర్తన.

కమాసు రాగం - ఆదితాళం.

### పల్లవి.

శంకరునిమెడబాయజాలనె-పంకజాక్షిరో॥శివశంకరు॥

### అనుపల్లవి.

వంకాలన్నిదీర్చి నామెంచిం-కాకరుణించెప్రభు ॥ శం
కరుని ॥

### చరణములు.

కోటిసూర్యులతోటి సరిగల । సీటుబల్ ధాటే । యే
టిమాట లమ్మవీరితోటి సాటిలేర నేటి॥శంకరుని॥ (౧)

అంగనలు పదివేలుగూడిచె । లంగుచుండగనూ । మం
గళా వాద్యములతోపొంగి యానందించె॥శ్రీశంకరుని॥(౨)
రమ్మని కృపజేశి నేసీ । సొమ్మనీయనవె । యిమ్మహిలో
నమ్మువారిని । జమ్మూగారక్షించే ప్రభు॥శంకరుని॥ (౩)
భాగవత శ్రీకృష్ణమూర్తిని భజనశేయూచు । యోగ
భోగముల సంధిబాగూగా దెలిశిన ॥ శ్రీశంకరుని ॥(౪)
ఫీలుకాన శంకరుండను పేరుగలమేటే । చాలుచాలు
నంన్నాదాక - మేలుగా బోధించునట్టి ॥శంకరుని॥ (౫)
మాదిరాజు వంశలక్ష్మణమంత్రి సుతుడైనా । మేదినీశ్రీ
సూర్యరావని । మెచ్చివరములిచ్చు ప్రభు ॥శ్రీశంకరుని॥ (౬)

శ్రీశంకరదేశిక ప్రభుమహారాజుకీజై.

నరహరిరావుకృతం.

సీ॥ శ్రీకృష్ణ గురుని సత్కృపయెంత ఘనమో త
లంపమీకడకు చెలంగివచ్చి । పట్టిమిమ్ములనొంచు భ్రమ
రకీటకన్యాయమున తమరీతి మిమ్ములరచించి । భువనంబు
లోని మానవసమూహంబు లొకొక్కమారుమీపున్న య
డకువచ్చి । వాత్సల్యమునుగోరి వరుస మాయాంధకార
మున సద్వస్తుక్రమము లనక । బీదలై యుండువారికి మో
దమలర । వస్తువులజూడ వెలుగిచ్చి వరసు సౌఖ్యములను
బ్రతికించు । మీవంటి ముఖ్యగురుడు । గలడె ఫీలుఖాన

శంకరాగ్రణీసుధీశా ॥　　(౭)

చ॥ ఘనమగు సౌఖ్యమొందు నధికారము లెవ్వరికైన లేవు క । ల్గిననవి శాశ్వితంబుగ ఫలింపవు వేంకటరెడ్డిగారు, మీ।యనయ కటాక్షముఁ।బడశి శాశ్వత సంపదనొందె నంచు నే । వినిముదమొందుచుండు నది వేమరు శంకరరాయుచిక్షణీ ॥　　(౮)

చ॥ నానానేక వనంబులఁ తపములెన్నం జేయు యోగశ్వరుల్ । శ్రీనాథాకృతి జూచియుండుదురు యోచింపంభవద్రూపిమై। తానామర్త్యుల కింపుగానులభ సత్కారుణ్య తత్వోపదే। శానందంబియలేదు శంకరసుధీశా నిత్యతేజోనిధీ ॥　　(౯)

౨౦ కీర్తన.

రాగం - ఆనందభైరవి - అటతాళం.

ఈరమేష్టిగురువుల పయినచెప్పినది.

పలవి.

రామామాటాడవేమిరా । నన్నూరంమ్మాని పిలువావదేలరా ॥ సీతారామా ॥

అనుపల్లవి.

దాతాలందరు జేప్పావింటిని। నేనే॥ దాసాకోటిలోజేరియుంటిని ॥ సీతారామా ॥

చ ర ణ ము లు.

కృష్ణావతారాముఎత్తితే । బాల। కృష్ణాలీలలమేలూ జూపితే ॥ సీతారామా ॥ (౧)

మాధావకృష్ణానిపిల్తునూనిన్ను। మదిలోనేవుంచినే గొల్తునూ ॥ సీతారామా ॥ (౨)

మోక్షా మిచ్చుటకైనే । వేడితిన్రా । రాక్షసాంతకరా వైతివీ ॥ సీతారామ ॥ (౩)

లక్ష్యాపెట్టక వున్నావేమిరా । నిన్నారక్షణమైనానే। వీడరా ॥ సీతారామా (౪)

భాగావతుల కృష్ణదేవుడౌనిన్ను । భజనాజేతుము పరం ధాముడౌ ॥ సీతారామా ॥ (౫

ఫీలుఖానవంశాధీరుడౌ । ప్రేమమీర శంకరదేశికేంద్రుడౌ ॥ సీతారామా ॥ (౬)

వందానమిదుగో గ్రహించు మిప్పొసాదు। మందాబుద్ధుల దొలగించుమీ ॥ సీతారామా ॥ (౭)

మాచిరాజు వంశౌజనితుండౌ । సూర్యమంత్రి నేలుము సీతాకాంతుడౌ ॥ సీతారానూ ॥ (౮)

శ్రీసద్గురు మహారాజుకీజై.

ఉ॥ శ్రీనెరయుణ జగద్గురుడు పృథివిజెరించెడిమానవాళికిణ । జ్ఞానముబుట్టజేయుటకు జక్కగసీతనువ్వుణ భ

రించిఫీల్ । ఖానసమాఖ్యబూను తగుసమ్మతి శంకరరా
యనిఁ మదిఁ।ధ్యానముశేయు వారుభవతండము దోలు
ట దెంతచిత్రమో ॥ (౧)

గీ॥ అనుదినమును మీాస్నేహాము । నెనరుఁసుజ్ఞాన
వృద్ధినియమమును । దలంచిననా । చింతదొలగె, ధరను
తు ఫీల్ ఖాన శంకరబుధవరేంణ్యా ॥ (౨)

భజనా.

జైగురుశంకరభోలానాథ్-పతీతపావనపంఢరినాథ్॥
మనాంపుండరీక వరదహారివిఠేల్॥

౨౧ కీర్తన.

ఆనందభైరవిరాగం - ఆదితాళం.

తంగామమెట్టూ.

పల్లవి.

శ్రీభాగవతకృష్ణ । శ్రీభాగవతకృష్ణ । సేవకుఁడైనట్టి ।
శంకరుడీతడంమ్మా । ఫీల్ ఖాన శంకారుడీతడంమ్మా ॥

అనుపల్లవి.

బాలప్రాయములోనే। భక్తిసద్గురునిపై । బాగుగవుం
చి నాడమ్మా । వీరిభాగ్యామే మందుమమ్మా ॥ శ్రీభాగ ॥

చరణములు.

పంఢరీనాథూడూ । పరమదయాళూడై । ఖండితముగ

నిల్చెనూ। శంకరు, హృత్పుండారీకమందును॥ శ్రీభాగ॥ (౧)
వేశెను బ్రహ్మసత్రం। వేలసంఖ్యలవరకు। కాశీయింకు
జేనమ్మాయీ। భాసామాను లేకొమ్మా॥ శ్రీభాగవత॥ (౨)
పారాయణాదులు। భక్తితో జేశిరి। నారాయణాభజ
నా। పరమా, యుక్తితో గురుభజన॥ శ్రీభాగవత॥ (3)
ముందు సప్తాహము। అందముగను జేశె। సందేహా
మిది పోయెను। జనులకా నందామధికమాయనూ॥ శ్రీ॥ (౪)
నందనమార్గశిర। మందు। ఆరంభామయి। పొందు
గ। పుష్యశుద్ధము। తాదియవర। వందామయినా చం
దము॥ శ్రీభాగవతకృష్ణ॥ (౫)
దాసలక్ష్మణదాస। దాసుడుజూచేను। రోశేనుయిహా
సుఖము। శ్రీనీ। వాసాగురునికృపనూ॥ శ్రీభాగవత॥ (౬)

౨౨ కీర్తన.

కాంభోజిరాగం - యేకతాళం

మాయయను సంకల్పమహారాజు
అనేకబ్రహ్మాండములు పైనవేళినా
మోడి కీర్తన.
వెంకటాపురం - లక్ష్మయ్య కృతం.

పల్లవి.

వేస్తిచూడోయి। వక మోడి। నా। పేరేమాయలగారోడి॥

## అనుపల్లవి.

వాస్తవంబుగనాస్తితేయిది । కాస్తసేపిటు । జూస్తెజా
లును । యీస్తలంబున । జెగదుత్పత్తి గజేస్తినా వస్తావి
జూడవేడి ॥ వేస్తి ॥

## చరణములు.

అంకిలిజేప్పానువిను । సంకల్పముగా సిద్ధిగావించి ।
పాంకమూ నారూపామే । సంకల్పమును యాభ్యా తెం
చాగ ॥ వేస్తి ॥ (౧)

అండమునా పిండాండమునా ॥ బ్రహ్మాండమునా । గా
వించివెంటనె । రెండు మూడోకసారె । క్షణమున ఛేం
డినే । లేకుండజేశెద ॥ వేస్తిచూడోయి ॥ (౨)

తామసా రాజాసములపై । ప్రేమసత్వా ముండా
జేశి । కామమూ । క్రోధామూలోభా । మోహాముక
ల్పానజేశి ॥ వేస్తి ॥ (౩)

నేనెలోకులలోనగల్గి । యనేకబుద్ధులు బోపజేయు
చు । కానిపోసి కలహాములను । పూనుకోని - నాలో -
నే నవ్వుచు ॥ వేస్తి ॥ (౪)

సూక్ష్మరంధ్రా మందూనెనే । నూటిగా నివసించ్చి
యుండి । మోక్షమాపేక్షించు వారికి । దీక్షచే గనుపింత్తు
చూడుడి ॥ వేస్తి ॥ (౫)

నాలుగు మహావాక్యములను । చాలుగా సృజియించి పెట్టి । కీలు దెలియాకుండా జేశి । మేలుగా నావలలో గూలగ ॥ వే స్తి ॥ (౬)

క్షేత్రక్షేత్రజ్ఞుండానైనా । సూత్రము దోచానివ్వక । మూత్ర పతన స్థలమూనందే । మాత్రమూ । భ్రాంతి విడకుండా ॥ వే స్తి ॥ (౭)

అంతు నాదింతాని తెలియా । రెంతవారా త్రైతే నేమీ । వింత వింతాలు గావించి । వంతుబాపిక రంతుజేయక ॥ వే స్తి ॥ (౮)

వాసిగా భాగవతా కృష్ణా । దేశికె ప్రభు వరుడూ నన్నతి । మోస గాడని నాకో సామే । చేశె కందార్థణాంబుల గ్రంథము ॥ వే స్తి ॥ (౯)

బింకమూచే వుండే నేనే । వంకకూ బోయీనా జూచి । శంకరా రామేంద్రా మంత్రే । వంకలూ బెట్టూనెకాని ॥ వే స్తి ॥ (౧౦)

వెంకటారామదాసూ డా । టంకమూ లేకాపడియుండి । శంకరా రామేంద్ర మంత్రి । కింకరూడై నన్నూదెలసే ॥ వే స్తి ॥ (౧౧)

దరిశనా మాత్రంబునా సూ । దరిశనం సుపుత్రుడై నా । స్థిరాముగా లక్ష్మణాఖ్యాయుడు । విరాళిచే నా

సితి రచియించే ॥ వేసి ॥ (౧౨)

శ్రీసద్గురు మహారాజుకీజై.

## ౨౩. కీర్తన.

హిందూస్తాని రాగము.

మాడిరాజు సూర్యరావు కృతం.

పల్లవి.

ఇసీ ప్రవాహమే । బ్రహ్మాజీభీ । డుబు డుబుకేర్హా । మరాహై

అనుపల్లవి.

రామనామతుం । భజసే ప్యారే । కాహేకుమగురూర్ । కర్తాహై ॥ రామ ॥

చరణములు.

జనన మరణకే । ప్రవాహకూతూ । కిస్ నావుసేపార్ హెూతాహై ॥ రామ ॥ (౧)

సద్గురుజీ నేవు సీనావుకూ । మల్లాహెూ । పార్ కర్తాహై ॥ రామ ॥ (౨)

జపమేకభ్ నహీ । తపమేకభ్ నహీ । ధ్యానమేకుచిభీ । నహీనహీరే । సద్గురుజీకే చరణకమలబిన । జోకుఛ్ సంఝొమిథ్యారే ॥ రామ ॥ (౩)

భాగవతాస్త్రీ । కృష్ణగురూసె । ఫైజ్ । పాకె । ఆస్ ।

దునియాకూ । పావనకరనే । ప్రాప్తహువేసబ్ । భక్త
కోటి ఉద్ధారకేలియ్యే ॥ రామ ॥ (४)

శంకరప్రభుకే। దాస్ భాస్కరు । వేదోబాతే । కహె
తాహై । సద్గురుజీకే । చరణసెమాయా । గయేతోనిజ
పద । రహితాహై ॥ రామ ॥ (५)

౭४. కీ ర్త న. (భ క్తి)

ఇంద్రసభ ధాటి.

శుద్ధ కాంబోధి రాగం - రూపక తాళం.

ప ల్ల వి.

దేశికవర । దేశికవర । దేశికానాథా । నీ, దాస దా
సులకునే । దాసుడ నాథా ॥ దేశికవర ॥

అ ను ప ల్ల వి.

పంతామూ జేయుటమేరా । పతితపావనా । కా - శాం
తమైన కరుణ జూడు । కమలలోచనా ॥ దేశిక ॥

చ ర ణ ము లు.

మాయను విడజేయునట్టి । మహిమ గలిగినా । పాద
మూలే నమ్మితి । పాపనాశనా ॥ దేశిక ॥ (౧)

సకల నిగమ సారమైన । సత్త్వబోధనూ । నా-వికల
మానసంబు పట్టి । పెకలి ద్రుంచుమూ ॥ దేశిక ॥ (౨)

. భాగవతుల కృష్ణ గురుని । భక్తుడాయైనా । నీ - త్యా

గభోగమూల నెన్న తరమే మాయున్నా॥ దేశిక ॥ (3)
ఫీలుఖాన । వంశ జలధి పూర్ణ చంద్రుడా । శ్రీ -
శంకర దేశిక నాథా । నావంకదీర్చితే ॥ దేశిక ॥ (౪)
. మావిరాజు వంశ సూర్య । మంత్రి సేవితే । పాదుగా
నాత్రాంతులన్ని । పట్టిముంచితే ॥ దేశిక ॥ (౫)

శ్రీరామకృష్ణ శంకర దేశిక ప్రభు మహారాజుక్కైజె.

గండికోట - నృశింహాచారి కృతం.

శ్లో॥ పాయాత్ శ్రీరామచంద్రః । సతతశివకరః । సజ్జ
నానందకారీ । సీతా లాభాతి రామః । కమల నయనకః ।
సత్యవాదీ సమేశాః । శాంతంకాంతం సమేశం శుచిగుణ
నిపహాం । సాధుమార్గ ప్రవృత్తం । పాయాత్తం శంక
రేతి ప్రథితనరవరం । సూరీనమ్నావ సీయ్యాం ॥ (౬)

శ్లో॥ శ్రీమచ్ఛంకర రావు కీర్తి వనితా కాంతం ప్రియం
కామినీ । సర్వం విశ్వమవేక్ష్య । కుత్రచిద పిప్రాప్తానసా
సుందరీ । గత్వాస్వర్గ మవేక్ష్యతత్ర విభాగం । శక్రంపు
నర్నిర్గతా । పాతాళఃసజలం । నిరీక్ష్యనితరాం । స్వే
తాభవచ్ఛంద్రవత్ ॥ (౭)

శ్లో॥ అపకీర్తిర భూత్సుభూతలే । నచమేరుంప్రదదా
తి । సోప్యసౌన సముద్రజలం నవినశ్యతీ । తృసరాబాధ
తి సజ్జనావళిం ॥ (౮)

శ్లో॥ భక్తశ్శంకరరావు సూరిపరకః॥ ప్రహ్లాద ఏవా పరో। దానంతస్యనవిద్యతే పరతరం। తేస్తః పరేశంకరే। ఏవంసూరిజనః సదానిగరతి॥ శ్రీకంఠభక్తేశ్వరం। యం పాయాచ్ఛివమలః। సదా శివపరః। తం దేవదేవేశ్వరః॥ (౯)

శ్రీశంకర దేశికప్రభూ మహారాజుకీజై.

౨౫. కీ ర్త న. (భ క్తి)

ముఖారిరాగం – ఆదితాళం.

ప ల్ల వి.

పంఢరిపురవాసా। నాపై। పంతము లేటికిరా॥

అ ను ప ల్ల వి.

దండిగదానునిపై। దయతోడుత। దరిశనమివ్వగదే॥

చ ర ణ ము లు.

నిండుభక్తితోడా। నేసి। యండజేరినాడా। ఖండిత మేటికి నాయందుననీ। కరుణజూపరాదా॥ పం॥ (౧)

స్థిరుడవునీవెసుమీ। దురితా। హరుడవునీవెసుమీ। చెరుడవునీవెసుమీ। పరాత్పరుడవు నీవెసుమీ॥ పం॥ (౨)

నమ్మినాను నేమా। నా। నమ్మికైనజూడూ। యిమ్మహిలోనీ। కన్నదయాళుడు। వెటుజూచిన లేడూ॥ పం॥ (3)

పిలువగా నెరంమ్మీ। అభయము। తెలువగా నెయిమ్మీ। సకలకాలమునా। యందుకరుణచే। కాపాడుమునుమ్మీ॥ పం॥ (౪)

రాముడవీవెనుమీ। జగదభి। రాముడవీవెనుమీ। జయ బలరాముడవీవెనుమీ। సీతారాముడవీవేనుమీ॥ పం॥ (౫)

వేగమెరావయ్యా। నాతో వీ। రాగమెందుకయ్యా। భాగవతులశ్రీ। కృష్ణమూర్తివని। భావించెదమయ్యా॥ పం॥ (౬)

కీలుదెలిశ్రేనయ్యా। నాకిక। మేలుగలిగేనయ్యా। శీలుఖానశ్రీ। శంకరదేశిక ప్రభురూపుడవయ్యా॥ పం॥ (౭)

మాదిరాజువంశా। సూర్యామంత్రి వినుతదేవా। పాదుగనా మదిమందిరముగగని। పాలించగలేవా॥ పం॥ (౮)

మనాపుండరీక వరదహరి విఠల్.

౨౬. కీర్తన.

అపరూపరాగం - ఆదితాళం.

పల్లవి.

రారావిఠల। రామమనోహర। మామనోరమణిని। న్నే మదిగోరెను॥ రారావిఠల॥

అనుపల్లవి.

మనోకాంతనిను। మదిలో వేడుచు। మరులుకొన్నది క। విరహముమాన్పగ॥ రారావిఠల॥

చరణములు.

ముడుపముకుడువదు। నుడువదుమాటను। తడబడుచునునీ। యడుగులు వెదకును॥ రారావిఠల॥ (౧)

కీరవాణినిను । కోరినదానిగ । నీరములైనను । నేరదు

గ్రోలగ ॥ రారావిఠల ॥ (౨)

యేపనిఁజేకక । యేమనలేకను । నీపదములపై । నిలి

పెను చిత్తము ॥ రారావిఠల ॥ (౩)

నిముషము యుగముగ । నెలతకుదోచెను । నిలువదు

ప్రాణము । నీరజాక్షయిక ॥ రారావిఠల॥ (౪)

హాహావిఠల । హానాయకయని । పణతిభూమిపై । బ

డి మూర్ఛిల్లెను ॥ రారావిఠల ॥ (౫)

మున్నునీవు జే । శినమర్యాదలు । మెన్నగలేనని । య

న్నదిగనుకనే ॥ రారావిఠల ॥ (౬)

చేరినీకౌగిట । జేర్చితాపమును । దీరగ జేయుము ।

రారి మ్రొక్కెదను ॥ రారావిఠల ॥ (౭)

కోటిచెప్పయిం । కేటికిప్రభువర । పాటలగంధిక । బ్ర

తుకదు నినువిడిచి ॥ రారావిఠల ॥ (౮)

భాగవతోత్తము । లాదిగగొలచే । భాగవతులశ్రీ ।

కృష్ణదయానిధే ॥ రారావిఠల ॥ (౯)

ఫీలుఖానశ్రీ । శంకరరూపక । పాలబడెనుమము । పా

లించగనిటు ॥ రారావిఠల ॥ (౧౦)

మాధిరాజువం । శజసూర్యుని బహు । మానముజేశె ।

మాధవశ్రీహరి ॥ రారావిఠల ॥ (౧౧)

ఉ॥ వాసవలోకమందుసే వనవాసము శేయుచు । వృక్షరాజికిన్ । బాసటనైమె యిటుండుటయు బాటి యగాదని యిచ్ఛగించియా । వాసవ భూరుహంబు జెన వాంఛితముల్ మొనగూర్చ లోకముఖ్ । శంసయెున వంబుట్టెనుక శంకరరాయుడనంగ మేదినిన్ ॥ (౧౮)

## ౨౭ కీర్తన.

కల్యాణిరాగం - అటతాళం.

### పల్లవి

సభ జేశి కూచుండుడీ । శంకర దేవా । సభ జేశి కూచుండుడీ ॥

### అనుపల్లవి.

సభ జేశి కూచుండి । సకలాసుజనులారు । అభయా దానమ్ములిచ్చి । యానందమొందించా ॥ సభ జేశి ॥

### చరణములు.

తుంబూరు నారదాదులు । మేనకాది । రంభ ఊర్వశి కాంతలూ । వీణేలు మీటూచు । నటనాము జేయూచు । తాళ మృదంగాది ధ్వనులు చేలంగాగ ॥ సభ జేశి ॥ (౧)

కనకాభరణంబులు । రత్నరుచిత । కంకాణ భుజ బంధులు । మణులుమాణిక్యాది । మరిజీవరత్నాలు । పనిబూని కూర్చినవే । శినహారములు మెరయ ॥ సభ జేశి ॥ (౨)

శ్రీభాగవత కృష్ణాసీ। శేవజేశి। చేరితిరాము క్తీసీ। యే
రిమీతో సాటి। యీ రేడుజగమూల। లేరూ లేరని తెల
శీ। కోరీవస్తిరిమిమ్మ॥ సభజేశి॥ (౩)

ఫీల్ ఖానావారందురూ। త్రిలోకము। లోకూలుపూ
జింతురూ। వరనామెపల్లిసీ। వాసూలైయున్నట్టి। పురు
షశింహ్వాపరమ। పురుషశ్రీశంకార॥ సభజేశి॥ (౪)

బూరుగు నరశింహబ్వాలూ మీపాదముల। పూజిం
చాకోరుంన్నాడూ। సారాములేని సంసారాముసీదించి।
చేరీకాతో భక్తాజనులంలో జేచూరేక॥ సభ॥ (౫)

శ్రీకృష్ణశంకరాదేశిక ప్రభుమహరాజు కీజై.

శ్లో॥ శ్రీనాథుడు నిజప్రభావమెరుకన్। జేయంగ
బా వచ్చిఫీ। జ్ఞానాశంకరరావు రూపుడై। రంగత్కృ
ష్ణగుర్వాస్యజశ్రీ వాక్యంబెరిగించె తద్గురుకృపాశ్రిత సు
జ్ఞానమున్ బూనె న్వెంకట రామదాస వసుడోప్పెన్
మూల మల్లాఖ్యుడై॥ (౬)

## ౭౮ కీర్తన.

రాగం - నాదనామక్రియ - అటతాళం.

పల్లవి.

శంకరేంద్రుని వేగదెమ్మా। నాదుసంకటంబులు బా
పవమ్మా॥

అనుపల్లవి.

పంకజాక్షిరో పోయి పదిలముగ నామనవి పొంకము
గ వినజెప్పి పాలతిదయబుట్టించి ॥ శంకరేంద్రుని ॥

చరణములు.

ముందునాయెందు కరుణుంచీ । నాదు మందబుద్ధుల
నెల్ల ద్రుంచి । సందేహమెందుకీ । సమయమున రమ్మనుచు।
బిందుకళనాదులను పొందించి విడచినా ॥ శంక ॥ (౧)

పండువెన్నెల జూపెనమ్మా । నాదు। ప్రాణములేవారి
సొంమమ్మా । అందముగ సహస్రారమందున బాలుండొన్ని!
ముందునానేత్రముల కందించినట్టి ॥ శ్రీశంక ॥ (౨)

అష్టాంగయోగములలోనీ । గోప్య। మంతజూపెనె నీ
లవేణీ। అష్టమదములు ద్రుంచినిష్టతోనుండుమని దుష్టజను
లతో పొందుస్పష్టముగ వద్దనిన ॥ శంక ॥ (3)

మహావాక్యములు నాల్గుదెల్పి । వాటి।మమతవెంటనె
బాగదెల్పి । యిగోచూడు పరమపథమిదుగో పరిపూ
ర్ణంబు। యిదిమూలధమంచుపదిలముగజూపించె॥శం॥(౪)

ఈశరీరము స్వప్నమందూ । దోచు । వాటివలెనె
లేవుయెందూ । గానయెరుకను నమ్మరాదనుచు ఘనులెం
చి, నార్ంనుచు। నాటించినన్ను కృపనేలిన ॥ శంక ॥ (౫)

వేమిజెప్పుదువారి మహిమా। నాకు। నోవాడఫేస

ఖియువినుమా। యీమహిలోవారిసా। టేమహాత్ములు లేరు। నామనోహరులైై। నన్నుకడ తేర్చిరినా॥శం॥ (౬)

శ్రీభాగవత కృష్ణమూర్తి। వేషముమరదాల్చెనే విష్ణు మూర్తి। యీకృష్ణదేశికేంద్రుని శేవలోనుంచి। బాశియె టుజనడమ్మా భక్తిగలవాడమ్మా॥ శంక॥ (౭)

ఫీల్ఖాన వారందురమ్మా। వారిప్రియశిష్యుడనె ము ద్దుగుమ్మా। తలచినంతనె మనసుపలుచనై చలనమా। అ లవేణిసేవైన అతిశీఘ్రమునగబోయు॥ శంక॥ (౮)

నాంపల్లిపురవాసుడమ్మా। లక్ష్మీవరసమూంబకు నా థుడమ్మా యీతీరుగుర్తునే। నీతోటిజెప్పితిని, నాతోడె యితరులకీయంతు దెల్పకను॥ శంక॥ (౯)

పాదదర్శన మవ్వమనుచూ। బహుగప్రార్థించెమి మ్ము రమ్మనుచూ। గోగులావంశమందాగయ్య యనుదా సు। డీగతిని మొరబెట్టినాడనుచు త్వరితముగ॥శం॥ (౧౦)

శ్రీసద్గురు మహారాజుకీజై.

మాదిరాజు సుర్యారావుకృతం.

ఉ॥ శంకరరాయసద్గురు విశేషతరోక్తి సుధారసంబు ప్రా। త్పంకరుహంబు బొందహరి పాదములన్ గనుచున్ స దాళిరా। ట్సంకటముల్ హరింపఅజిటన్ పనిబూనుచు మూలిమళ్ల స।ద్వేంకట రామదాసుడు భువిన్ విలశిల్లును

రాయచూరిలోన ॥ శంక ॥ (౧౧)

౨౯. కీర్తన.

హిందూస్తానిరాగం - గజల్

పల్లవి.

జోకుఛ్ కరనాసా, జల్దీకర్ । నహీం । అతాయేతన బకకర్ ॥

అనుపల్లవి.

బనీ ఆదంక అవులాద్ హై । మగర్ । పానీక । పుతలా హై ॥ జోకుఛ్ ॥

చరణములు.

ఇసీపర్ । భార్యసాకర్నా । వుమర్ కూ । ఆప్నేభో దేనా ॥ జోకుఛ్ ॥ (౧)

నహీంవుమిన్నాదు । కాయంకా । కేహార్ నవున్నహైజు దాయిూకా ॥ జోకుఛ్ ॥ (౨)

అజబ్ దున్యాకి సూరత్ హై కిసీకు, కూఛ్ । దిఖాంతీ హై ॥ జోకుఛ్ ॥ (౩)

కుదురతేకా । దరెసీహై । బూదునాబూదుక ర్తీహై॥ జోకుఛ్ ॥ (౪)

అమనకుకోయి । జగహాభీనహీం । బజుజ్ మూంపానదేక కదుమూంకే ॥ జోకుఛ్ ॥ (౫)

వొ॰శంకర్ నామె ప్రభువర్ హై॰। దీనుదునియా॰సెలా॰
తమా॰హై॰॥ జో॰షుఫ్ ॥ (౬)

వహీ॰సే। మా॰యపై దా॰హై॰। వుసీజా॰న్హా॰। ఫనాభీ
హై॰॥ జో॰షుఫ్ ॥ (౭)

ముగ్ధదేహ॰౨రహా॰౭ర్ హై॰। కేమా॰యా॰షు। ఘుడా॰వత్
హై॰॥ జో॰షుఫ్॥ (౮)

·ప్రభూ॰కే। డర్ కా॰ఖా॰దెం హై॰। కెబో॰ధా॰నందు ఆనం
దు హై॰॥ జో॰షుఫ్॥ (౯)

మనాపుండరీక వరద హరి విఠేల్.

సీ॥ నరహరివని నిన్నునాత్మ శేవించెద। పురహ॰రుండని
సిన్నుపూ॰జఁజేసి।నవనిధిదొ॰రవని నమ్మితిస్వర్గా॰ధిపతిబ్ర
హ్మసూ॰ర్యుల పగిదినిన్ను। ధరణిపా॰లించెడు ధన్యులుమీ॰
తో॰నుసరిరా॰రటంచునే చాటితిలను। సద్గురుండని సిన్ను
సన్నుతిజేసియు దొ॰రవనినమ్మితి దో॰షమెంచ। కిలనుబ్రో॰
చెటి ప్రభువని ఋఁపుతో॰డ। భక్తిమా॰ర్గ॰౦బుతో॰ నిన్ను
ముక్తికో॰రకు। ధరనుమూ॰ర్ఖుల్ల రాందా॰సుధన్యుడిలను। గు
రుని సేవించె। శంకరగురునిభువిని॥ (౧౦)

౩౦. కీ ర్త న. దృష్టాంతం - భక్తి
నా॰దసా॰మక్రియరా॰గం - ఆదితా॰ళం.

ప ల్ల వి.

శంకరా॰చా॰ర్యులవా॰రి। కింకా॰రూ॰డనూ॰॥

అనుపల్లవి.

వృజినా। సంఘూలామింకానను జూడా। శంకీలాకతల యెత్తూనే ॥ శంకరా ॥

చరణములు.

సృష్టిస్థితిసంహారాములనూ। జేయాదలచీ సగుణూడైన। అష్టామూర్త్యవతారామితడం। చఖిలాజెనులూబోగుచూచుండే। శంకరా.॥ (౧)

అణిమాదీసిద్ధూలెనిమిది। యరుదెంచీ తమయందూగలుగూగుణమూలు పీనబలికినను। గైకొనుమానీ వేడుకొనియేటి ॥ శంకరా ॥ (౨)

చదువాకనే చదుపూ న్ని। జదివి వాటిలోతూ దెలిసీ। చదుపూ లాసానిగనీతో। చదుపూనబెనగీ గెలచిన ॥ శంకరా ॥ (౩)

శ్రుతులా నిందాజేశేటి దుష్కృతులా మతమూలణచిమంచి। మతమూలా నారింటిని యూతిమీదా సంస్థాపించిన ॥ శంకరా ॥ (౪)

మెరుపూ తెలుపునలుపు నలుపూ। లెనశీనాతమిన్నా లేకందూ। తిరమూగానిలచీ మెరసెడు। దేవునిభక్తుల కూజూపే ॥ శంకరా ॥ (౫)

నాలుగు మేనూలాకవలీ। నాణేమా వస్తువనూ దె

లపీ । నాలుగుమేనూలాజ్యోలి । నయమూనా విడిపించీ
నట్టి ॥ శంకరా ॥ (౬)

తనుభ్రూకెరుకా కందానట్టి । దానిమేల్కోగా జూ
పించీ । తనువెరుకాలకెంటిని కలగాదా చాకావినజెప్పి
నట్టి ॥ శంకరా ॥ (౭)

ఫీలుఖానా వంశామందూన । ప్రియమూతో తామవ
తారించి । కామాంధా కారూలగర్వ । మేమిూలేకుండా
జేసిన ॥ శంకరా ॥ (౮)

ఆగామానిగమాదివిద్యాల భ్యాశించా నెరుగానట్టి ।
బాగూగా మధురాకవియనటి । భక్తానుర క్షూజామై
నట్టి ॥ శంకరా ॥ (౯)

శ్రీశంకరప్రభు మహారాజుక్జై.

సీ॥ దాతదైవంబని ధరణిలో మీపాదపద్మముల్ సే
వింతు పరమపురుష । హృదయంబులోపల సదమలధ్యా
నంబు కమలంబులలో పూజగాంతునయ్య । నిరతంబు
నీనామనేమంబు దప్పక నిశ్చలభక్తితో నిలతునయ్యా ।
నేను దాసత్వంబునీకు సమర్పింతు నేప్పుడౌనన్నేలు
నీరజాక్ష । ధరనుగోలాండపట్టణ గురువరుండు । విప్రకు
లమందు వెలశిన వేదవేద్య । వరుసఫీలాన శంకరవరుడు
మూలమళ్లవేంకటరాందాసు।మహినినేలు॥ (౧౦)

## 3౧ కీర్తన. రాగం రేగుప్తి - యేకతాళం.

### పల్లవి.

దర్శనమివ్వవే శంకరా। దాసపోషకా శంకరా॥

### అనుపల్లవి.

అభయంబివ్వవే శంకరా। ఆశ్రితవత్సల శంకరా।
ఆనందరూప శంకరా। దివ్యామృత సేవితశంకరా॥దర్శ॥

### చరణములు.

దీనపోషకా శంకరా। దివ్యప్రభావా శంకరా। సా
ధూజనావన శంకరా। శాశ్వతచరితా శంకరా॥దర్శ॥(౧)
మాయోద్ధారా శంకరా। మహామంత్రదాయకా శం
కరా। ఆత్మరూపకా శంకరా। అఃహరి పూజితశంక
రా॥ దర్శనమివ్వవె॥ (౨)
నామరూపనా శంకరా। నారదవరదా శంకరా।
ముక్తిదాయకా శంకరా।మూలవిచ్ఛేదనశంకరా॥దర్శ॥(3)
పూర్ణబోధకర శంకరా। పురాణపురుషా శం
కరా। అమితసూర్యసుత శంకరా। ఆనందదాయక శంక
రా॥ దర్శనమివ్వవె॥ (౪)

శ్రీనిజగురు మహారాజుకీజై.

(భజన)

హరగురుశంకర భాలానాద్.

మనాపుండరీకవరద.

రాజారామచంద్ర మహారాజుక్రై.

మనాపుండరీక వరదహరివిఠేల్.

3౨ కీర్తన. బేగడరాగం - ఆదితాళం.

పల్లవి.

రాధామనోరంజనా । రాక్షసభంజనా ॥ రా ॥

అనుపల్లవి.

కామజనక సుకుమార మేరునగ । ధీరహీర వనమాల ధారిహరి ॥ రాధా ॥

చరణములు.

కంజాదళేక్షణ । కపటజన శిక్షణా । కారుణ్యవీక్షణ। కరివైరి మోక్షణ । కనకవసనకనకా సురభంజన । కమల మనోహర । కామితఫలదా ॥ రాధా ॥ (౧

కుందేందుహాసా । వైకుంఠవాస । కువలయపోష । కూర్మితోవాస । జనులపోషణ జేతువనుచు । నినుకాచు కయుంటిని । కావుమటంటిని ॥ రాధా ॥ (౨)

దీనజనపోషణ । పావనపావణ । దివ్యసులక్షణ । దీపితామోక్షణ । రాజరాజనుతకామ । సహితసూత్రామ వందితా గోత్రోద్ధరణా ॥ రాధా ॥ (3)

పాపసంహారా । పరమార్థవిచారా । భాగవత కృ

ష్ఠా । తీరేనాత్రష్ణా । శంకరేంద్రగురు కింకరుండసం ।
పూర్ణబోధిత । నందదాసనుత రాధా ॥ (౪)

మనాపుండరీకవరద హరివిఠేల్.

53 కీర్తన. రాగం శంకరాభరణం - ఆదితాళం.

పల్లవి.

అంబానను బ్రోవలేవా । నన్నెడసేయుటధీవా॥అంబా॥

అనుపల్లవి.

నిన్ను నమ్మియున్ననాతో । పంతములేలే । పశుపతి
రాణి ॥ అంబానను ॥

చరణములు.

పనగ్నవేణీ పంకజపాణీ । భండదనుజసంహారి లోక
ఉపకారి । దుష్టసంహారికుమారి ॥ అంబా॥ (౧)

మహిషదానవమర్దని । మాసితశ్రీవర్ధని । దురితహా
రీ । దుష్టసూరీ । నవదుర్గానారాయణి ॥ అంబా॥ (౨)

నామరూపవర్జితా । నాదుబిందూ కళాతీత । బు
ద్ధిదాయి నీబోధకరీ । పోషితలోకైకమాతే॥అంబా॥ (3)

సోమ సూర్యలోచనీ । సూరీజనపోషిణీ । మహాం
మ్మాయి మధుకైటభమర్దిని । పరమేశ్వర పరిపూర్ణ
కటాక్షిణి ॥ అంబా ॥ (౪)

లలితాపరమేశ్వరి । రామార్చిత శ్రీకరీ । రామరూపీ

రాజ్యదాయి । రాక్షససంహారీ । రాజరాజేశ్వరీ॥అం॥ (౫)

శుంభాసురమర్దినీ । శోషితామర పోషిణీ । నిలకం
ఠనపాయి । నిత్యసుఖదాయి । నమితబోధానంద । దాస
శాశ్వతవరదాయి ॥ అంబా ॥ (౬)

౩౮ కీర్తన. సురటరాగం - ఆదితాళం.

పల్లవి.

సదానిన్ను నేమదినిఁభజించెద । జననీ । శంకరీ । జ
గజ్జననీశంకరీ ॥

అనుపల్లవి.

ముదమొదవగ నీమ్రుపదార్చ్య నలమొదగినేయు । కద
సికపణగావుము ॥

చరణములు.

వనములోనగు హిమగిరి వరసుత । ననుపరునిగ జూ
డకుపరదేవతాఅంబా ॥ సదా ॥ (౧)

కపటనాటకీ । కామితఫలదే । కృపజూడుము లలితా
త్రిపురసుందరీః । సదా ॥ (౨)

ఆర్యనిసుత మితధైర్యశౌర్య సౌందర్యమారాజు సూ
ర్యరాయనుతీ ॥ సదా ॥ (3)

భజన.

జగన్మోహనాగదే । నీనగు మొగమిటు జూపిపో
గదే ॥ ప్రా ॥

మనాపుండరీక వరదహరిపితేల్.

రాజరామ చంద్రమహారాజుక్జై.

శ్రీమద్భాగవత శ్రీకృష్ణదేశిక ప్రభుమహారాజుక్జై.

౩౫ కీర్తన. జంఝూటిరాగం - అటతాళం.

పల్లవి.

సద్గురుసచ్చిదా । నందపరాత్పర।స్వామివిశ్వేశ్వర । సరగున బ్రోవవే ॥ సద్గురు ॥

అనుపల్లవి.

నీలకంఠనిను । నేగానియాడగ । నేరనువినుదా । నేర ముతెంచక ॥ సద్గురు ॥

చరణములు.

అంబాసహిత । త్రయంబక ప్రమథులు । సందడిగాల్వ గ । సరగునబ్రోవవే ॥ సద్గురు ॥ (౧)

రాజవినుతగా । రాజవందితా। కామదహనసూ। త్రామ మనోహర ॥ సద్గురు ॥ (౨)

నాగవిభూషణ । నారదసేవిత । నారాయణసఖ । నా దవినోద ॥ సద్గురు ॥ (౩)

పాపహరణనిను । ప్రణుతిసేయగా । జాలనుసీకృప । జల్లుము వేగమె ॥ సద్గురు ॥ (౪)

శంకరనినుగాని । యాడగనే ని । శ్శంకుడనైతిని । స

ద్గుననాధా ॥ సద్గురు ॥ (౫)

ఆనందముతో । సంపూర్ణబోధల । నందదాసునకి ।
ప్రేమతో నేలుమి॥ సద్గురు ॥ (౬)

నమఃపార్వతీపతే హరహరమహాదేవా.

౩౬ కీ ర్త న .· యింద్రసభధాటి.

కల్యాణీరాగం - రూపకతాళం.

పల్లవి.

మోసమాయనే । నాబుద్ధికి మోసమాయనే ॥

అనుపల్లవి.

జన్మమెత్తిన నాటనుండీ । చేసినపనులేమనందు । శాం
తిమాని సేయరాని । చెరియలు నేజేశితిగద ॥ మోస ॥

చరణములు.

శ్రీగురూచింతమాని । స్త్రీలతోటి చెలిమిగోరి । వా
వులు నేమరిచిపోయి । వానిసేవిడచితిహా ॥ మోస॥ (౧)

కూటమిగా శిష్యులచని । బూటకమనినిష్ట జెడీ । భ
ష్టుడానై । కష్టపడితి । దుష్టజనులతోటిగూడి॥ మోస॥(౨)

యట్టకేలకు దిట్టముగా । ఘట్టిగురువు బోధలేక । వె
ట్టిపనులు జేయుచూనా।పొట్టనింపుకొనితుదకు॥ మో॥ (౩)

యారీతిన కొన్నిదినములే । గినతుది భాగ్యవశమున । చే
తను శ్రీశంకరగురు । చెంతజేరక నాటినుండి॥ మోసి॥ (౪)

రారా న్నాసీచజీవా । యెదిరనీభ్రాంతిద్రోవా । గారవ
మునజేరదీశ । కరముశిరమందుంచనపుడే ॥ మోస॥ (౪)

కరుణా రస పూరముచే । కావరముల తొలగదోచి ।
బోధానందా యనుచు చెవిని । జౌకగ । బలుకాకమును
పు ॥ మోసమా ॥ (౬)

శ్రీమత్పూర్ణానాశ్రీశంకరదేశిక ప్రభుమహారాజు కీజై.

గొంగులూరు - యెల్లదాసకృతము.

౩౭ కీర్తన. ముఖారిరాగము - అటతాళం.

పల్లవి.

శంకరా । దేశికప్రభుగారూ । పంకజా । నాభుని గొ
లచెదారూ ॥ శంకరా ॥

అనుపల్లవి.

నిక్కముగ నీకీర్తిజగములో । చొక్కమగు బంగారు
కన్నను । మెక్కవాయ నిజంబుగను । పరదిక్కు దిక్కు
లవెలశె దండిగ ॥ శంకరా ॥

చరణములు.

యిందందు చరియించా బోవ్వా । అందారి పిమ్మ
ట నీవుగాప్వా యిందువనల పొందుభవముల । జెందజే
యుట సందెటింగయు । యింరాకతియందు చిత్తము ।
జెంది కరమానందమొందెవు ॥ శంకరా ॥ (౧)

సారామూ । లేనిసంసారో । సాగారామీ చేటికి ధర్మకారో । వారివీరిని జేరకనుసు । విచారమునునో । రూరుబల్కుచు । మారజనకుని దారిగనుగొను । వారనగ విని నేరచించితి ॥ శంకరా ॥ (౨)

కాయామస్థిరమానినమ్మీ । కామక్రోధా ముల నటుజుమ్మీ । న్యాయమును విడజాయకను । అన్యాయము ను తెగగోయు దలచియు । తోయజాక్షుని మాయదెలిశే । ఉపాయముని యెడబాయవేన్నడు ॥ శంకరా ॥ (౩)

నీవెంతో సుజ్ఞానుడావూ । నిగమా । వాక్యాములు బల్కేదావూ । భావమున గురుదేవుడిక । సంజీవమనుకొని నీవెరింగియు । భూవలయమును । పావనుపర సేవ జేసితి వీవరకుభళి ॥ శంకరా ॥ (౪)

సకలశాస్త్రములుజదివీ । సత్యామదప్పనిచే । పదవీ । నికరముగనీ । లోకరికో సంచికదయాపర । ముఖముగాంచియు । సుఖమొనర్చిన సకలసద్గుణ । ప్రకటుడవూ । సూకలకును ప్రియుడవూ ॥ శంకరా ॥ (౫)

నాగాతల్పుని నమ్మినావూ । నధికా । ద్రోహములు ద్రుంచినావూ భాగవతశ్రీకృష్ణ దేశికప్రభును । వ్యాత్కము లంబునందున । వేగముగ గొలియాడచునుభవ । సాగరము లంఘించినాడవు ॥ శంకరా ॥ (౬)

—:రాగం - బేగడ - తాళం - త్రిపుట:—

ముక్తికాంతవని మునుతెలిగించిన । యుక్తులెల్ల మది
వింటి । ఆసక్తితో నిను గనుగొంటి॥ (౧)

ముక్తికాంతనని మునుతెలిగించితె । మూటి నంటకను
రమ్మి । మరిమూటిగెంటి యికలెమ్మి॥ (౨)

ఆరుపదియు పదియారును మీరితి । అటివరో నన్నిక
జూడు- నీపతినని నన్నిక వేడు॥ (౩)

తొమ్మిది దరువాజుల తాళములను తోశి వేశి నన్న
డుగగా। నీదాసురాల నిదేమరుగా॥ (౪)

తొమ్మిదిమీరిన పిమ్మట । దశమద్వారమునను గను
గొంటి । నాదమనేకమువింటి॥ (౫)

దశమద్వారము జేరి తెనీకును । దాసురాలనేగానా।
నిజదాసు దేవనిను నానా॥ (౬)

గురుకరుణచే నిన్నరసితిగద నా । గుర్తు గనలేవా
శ్రీసద్గురుమూర్తెసాక్షి॥ (౭)

గుర్తియీయుగమునందు ధరించిన । వర్తమానమే
విందు । కృపచేత నుడువవెముందూ॥ (౮)

భాగవతుల శ్రీకృష్ణుడనుచునను । భావింతురె ప్రాచె
లియా । ననుసేవింతురె ప్రాసఖియా॥ (౯)

భావాభావాము మీరినవారల । బాగుగమిముగను
గొంటి। నాభారమె మీదనియంటి॥ (౧౦)

ఫీలుఖానశంకర దాసుని-నీ- వేలుకోగదవెభామ । యి
పుడాదుకొనవెగుణధామా ॥ (౧౧)

నీవాక్యముల నేతల ధరించితిని । నీదానవె ననుగావు
మది ప్రేమచేతమము బ్రోవు ॥ (౧౨)

సరెనని సతిపతులిరువురు గూడుక । సరసములటు జా
లించి । బహుముఖియుచు ఆనందించి ॥ (౧౩)

యాలలు.

వేదాంతవిచారము.

ప్ర॥ నీవూనేను లేనిచోట । నీవూనేను లేకాకలిగి । మూ
నకా సద్గురువూకృపచేతా ॥ న్వూన్వూసీతారామా । కాన
రాకాపోదామురారా ॥ (౧)

తల్లిమాయా తండ్రిమాయ । తరుణిమాయ । తరచి
చూడ । మెల్లబాంధవులెల్లా మాయెరా ॥ న్వూన్వూసీతా
రామా । కల్లమాటా దలచాబోకురా ॥ (౨)

అష్టాంగయోగాములాలోనె । కష్టపాడే ప్రజాలకెల్లా
స్పష్టమూగా తెలియనేరాదు ॥ న్వూన్వూసీతారామా ॥
కష్టమే నష్టమైపోవురా॥ (౩)

ఉన్నదొకటి లేనిదొకటి। వున్నాదానిలో నెతో చె। లేని దాన్ని వదలిపెట్టరా। స్వాన్వోసీతారామా। అన్నబా స్నెసున్నా పెట్టూరా॥                    (౪)

ఎందారెన్ని జెప్పినావా। రందారీతో వాదాడక। ముందువెనుకా తిరిగిచూడరా। స్వాన్వోసీతారామా। మం దిమాటాలాడాబోకురా॥                    (౫)

పుట్టితేమి - పెరిగితేమి - పొట్టకూటికి తిరిగితేమి। కొ ట్టికొనరూ గిట్టితేమిరా। స్వాన్వోసీతారామా। వట్టిమాటా లు వదిలీతేమిరా॥                    (౬)

చదివీచదివీచదివీ చూడూ। చదువ్వాలాలో నేమిగ లవో। చదువకానె చదువ్వాజదవారా। స్వాన్వోసీతా రామా। చదువువ్యర్థాణమాని తెలియూరా॥                    (౭)

వేదాంసారాతీతాబోధా। వేదావేదాంతూలా కెఱు కా। వాదభేదములేకా తెలియూరా। స్వాన్వోసీతారామా గాధాలానేమంటూ బోరూరా॥                    (౮)

శ్రీభాగావాతూలక్ర్ష్ణా। యోగిరాజేంద్రులా సేవా। జేసితె దీనిజాడా తెలుసూరా। స్వావోసీతారామా। ఆశ పాశముతెల్లా బాసూరా॥                    (౯)

శీలూఖానా శంకారూని। పిలచినంతనె। ।బాంతూ

లుణగ। చాలుచాలనియెఱుకా దొలగెరా। వోవోసీతా రామా। మేలుమేలానిగురునిగలసెరా॥ (౧౦)

లేనివారూ లేనిచోటా। లేకాకల్లాలేని మాటా। లేని పాటాబాడిపోయీరి, వోవోసీతారామా। లేనిదానితో లేకాపోయీరి॥ (౧౧)

శ్రీకృష్ణ దేశిక ప్రభుసమర్థ
నిజగురుస్తవము, యింతటితో
ముగింపు. చేయడమయినది.
శ్రీసద్గురువేనమః.



